# శ్రీ గోదావధూటీ పరిణయము

గ్రంథ రచయిత :

శ్రీమ దాసూరి మరింగంటి వేంకట నృసింహాచార్యులు

గ్రంథ ప్రకాశకులు :

శ్రీ రామగిరి మహిళాభక్త సమాజము

1956

# సంపాదకీయము

శ్రీ గోదావధూటీ పరిణయ ప్రబంధ ప్రణేతలు శ్రీమ దాసూరి మరింగంటి వేంకట నృసింహాచార్యులుగారు.

ఈ మహాకవి దాదాపు రెండు వందల సంవత్సరముల క్రిందటి వాడని వీరు ప్రబంధములో వ్రాసుకొనిన వంశావళినిబట్టి తెలియుచున్నది. వీరి స్వగ్రామము మిర్యాలగూడెము తాలూకాలో చేరిన అనుముల గ్రామమనునది. ప్రస్తుతము వారి వంశీయులు అనుముల, కనగల్లు గ్రామములలో నివసించియున్నారు. ఈ కవి ఆశ్వాసాంత గద్యలో షోడశ ప్రబంధములు రచించినట్టుగా వ్రాసుకొనినారు. అందు ఈ క్రింద కనుపరచిన ప్రబంధములు నాకు లభించినవి. ౧ విదేహ రాజకన్యకాభ్యుదయము, ౨ గోదావధూటీ పరిణయము, ౩ విష్వక్సేన ప్రభాకరము, ౪ రామానుజాభ్యుదయము, ౫ నృకంఠీరవాభ్యుదయము, ౬. క్షత్రబంధోపాఖ్యానము, ౭. శ్రీకృష్ణశతానందీయము, ౮. జాంబవతీకుమారశృంగారవిలాసము, ౯. శల్యపిళ్ళరాయ చరిత్రము. ఇవి యన్నియు అముద్రితములె. ఈ గ్రంథములు దాదాపు ముప్పది సం.ల క్రిందట సంపాదించి కనగల్లు నా స్వంతగృహములో "తాళపత్రగ్రంథనిలయము" నేర్పరచి తాళపత్రగ్రంథముల నన్నిటిని సురక్షితముగా నుంచితిని. నావద్దనున్న ప్రబంధములు వాటిని రచించిన కవులపట్టిక "నీలగిరి" వారపత్రికలో, "గోలకొండ కవులసంచిక"లోకూడా ప్రచురించినారు కాని నేనే చదివి చూచి యానందించుచుంటిని. ఇట్లుండ, జిల్లా నల్లగొండలోచేరిన రామగిరి శ్రీరామచంద్రస్వామివారి దేవాలయమును సద్భక్తులగు శ్రీయుత బి. కన్నయ్య, డిప్యూటీ కలెక్టరుగారు శ్రద్ధాభక్తులచే (శిథిలావస్థయందున్న దానిని) పునరుద్ధరించిరి.

ఒకనాడు శ్రీకలక్టరుగారి ధర్మపత్నియగు శ్రీమతి రిందాదేవిగారి స్వప్నములో శ్రీగోదాదేవి సాక్షాత్కరించి నేను అండాళును; నన్ను ప్రతిష్ఠింపజేయుమని ఆజ్ఞనొసగిన తత్ క్షణము శ్రీమతిగారు స్థానిక మహిళామతల్లులను ప్రోత్సహించి, మూలభేరము, ఉత్సవభేరము విగ్రహముల శ్రీతిరుమలనుండి వేంచేపుచేసుకవచ్చి, ఆగమోక్తప్రకారముగా దుర్ముఖినామ సం. చైత్ర బ. ౭ బుధవారమురోజున అండాళును ప్రతిష్ఠించి ధన్యతనొందిరి. ప్రతిష్ఠాసమయమున గోదాపధూటీ పరిణయము ప్రబంధపారాయణ ఋత్విక్కరణము నా కొసగ మహోత్సాహముతో పూర్తిప్రబంధము పారాయణ మొనర్చితిని. ఆండాళు సన్నిధికి విచ్చేసిన శ్రీమతులందరు ఆండాళు చరిత్రామృతమును గ్రహించి, ప్రబంధము అచ్చువేయించవలయునను స్థిరసంకల్పమును వెలిబుచ్చిరి. తత్క్షణము శ్రీ ఉయ్యాల అమ్మయ్యగారు, శ్రీమతి గద్దం గోపమ్మగారు, శ్రీమతి రేవెడ్డి జానకమ్మగారు అచ్చువేయించుటకు ద్రవ్యముప్రోగుచేసిరి. గ్రంథము అచ్చువేయించి కృతార్థులయిన వీరిని మరియు ద్రవ్యదాతలను శ్రీ గోదాదేవి సర్వసమృద్ధి నిచ్చి రక్షించుగాత ।

ఈనాటికి నేను దాచిపెట్టిన ప్రబంధములలో ప్రథమ కుసుమమును వికసింపజేసిన మహిళామతల్లులకు నా కృతజ్ఞతల తెలుపుకొనుచున్నాను.

తాళపత్ర గ్రంథనిలయము
కనగల్లు
12 జూలై 1956

ఇట్లు
ఆ. మ. శ్రీరంగాచార్యు
గ్రంథసంపాదకుడు

శ్రీమతే రామానుజాయనమః

## శ్రీ ఆండాళు (గోదా) అమ్మవారి

## శ్రీ గోదావధూటీ పరిణయ చరిత్ర ప్రబంధమునకు

# ద్రవ్యదాతల సహాయ నామములు



1. నాయిని రంగారావుగారు. (నడిగూడెం) నల్‌గొండ, శ్రీరామగిరి ఆండాళు సన్నిధికి వెండి శఠగోపం సమర్పించినారు.
2. రేరెడ్డి రాజగోపాల్‌రెడ్డిగారు (బాబసాయపేట) ఆరాధన పాత్రలు శంఖధార చక్రధార సహస్రధార యుక్తముగ సమర్పించినారు.
3. రేరెడ్డి సరోజినీదేవిగారు (బాబసాయపేట) పుయ్యాల అద్దము చిలుకలసహా సమర్పించినారు.
4. సురభి సుమిత్రాదేవి (గోనదోయినపల్లి) వడ్డాణము సమర్పించినారు.
5. ఆలా చూడామణిగారు (వన్నాజిపేట) బనారసు పట్టువస్త్రము సమర్పించినారు.
6. కుందూరు కృష్ణకుమారిగారు (సూర్యాపేట) వెండి కంకణాలు సమర్పించినారు.
7. శ్రీ ఆండాళు దాసురాలు పుయ్యాలమ్మ
8. కె. సీతారామారావు, మారెపల్లి
9. కె. అనసూయాదేవి, మారెపల్లి
10. ఆలూరు రిందాదేవి
11. మిడివెల్లి రాజమ్మ. పెంజెరువుకట్ట (మంథిని) కరీంనగరు జిల్లా
12. వేనేపల్లి సావిత్రీదేవి, మొసంగి
13. వేనేపల్లి జగదీశ్వరి, ఆలగడప
14. మునుకుంట్ల వెంకటరామ నర్సమ్మగారు, యిట్కాలపాడు
15. గడ్డం గోపీదేవిగారు, చెర్కుపల్లి
16. పుష్పనూతుల కౌసల్యాదేవిగారు, తుంగతూర్తి
17. వినోదిని
18. ఆర్. జానకీదేవిగారు, బాబసాయపేట
19. కీసరి సుదేష్ణాదేవి, ఖమ్మంమెట్టు

20. నూకల జగన్నాధరెడ్డిగారు, పిండిప్రోలు
21. కీసరి స్నేహలతాదేవి, రత్నవరం
22. నూకల యశోదాదేవి, పురుషోత్తమాయిగూడెం
23. నూకల మనోరమాదేవి పురుషోత్తమాయిగూడెం
24. నూకల లక్ష్మీబాయి పురుషోత్తమాయిగూడెం
25. సరోజినీదేవిగారు, నడికూడ
26. వేనేపల్లి కనకమ్మగారు, మొసంగి
27. వేనేపల్లి కనకమ్మగారు, మొసంగి
28. సరోజినీదేవి, నడికూడ
29. దమయంతీదేవి, ఘనపురం
30. కస్తూరి రామతులసి, ఘనపురం
31. నూకల రావమ్మగారు, గుండంరాజుపల్లి
32. నూకల లలితమ్మగారు, పుష్పరగూడెం
33. నూకల చూడమ్మగారు, దాట్ల
34. మాదాడి సుమిత్రాదేవి, గూడూరు
35. అహల్యాదేవి కొండూరు
36. నాయిని పెద రంగనాయికమ్మగారు, నర్సింలపేట
37. లింగాల కౌసల్యాదేవిగారు, ఘనపురం
38. నూకల శాంతమ్మగారు, గుండంరాజుపల్లి
39. నాయిని సత్తెమ్మగారు, మాచేడు
40. నాయిని చినరంగనాయకిమ్మగారు, సిలువేరు
41. గడ్డం మల్లమ్మగారు, కొత్తపేట
42. కీసర వెంకట నర్సమ్మగారు, హసనాబాద
43. కీసర రంగనాయకమ్మగారు, హసనాబాద
44. దామిడి అహల్యాదేవి, సిరికొండ
45. శ్రీ లక్ష్మీదేవి, పాపన్నపేట
46. నూకల తారమ్మగారు, దాట్ల
47. వెంపెల్లి నారాయణ, జీడికల్లు
48. వస్సులేటి సీతామణి, నాంపల్లి

49. కె. నాగేంద్రరావు, తొలిచాకి
50. ఎ. వెంకటలక్ష్మిబాయి, అంతవరం
51. గడ్డం చొక్కమ్మగారు, కొత్తపేట
52. కుందూరు లక్ష్మికాంతరావుగారు, సూర్యాపేట
53. వస్పురేటి రామలింగి, తొలిచాకి
54. నాయిని మాణిక్యమ్మగారు, నర్సింలపేట
55. రాపాక కమలాదేవిగారు, వెంపటి
56. వస్పురేటి లక్ష్మినర్సి, సూర్యాపేట
57. శఠగోపం రేరెడ్డి గోవిందరెడ్డిగారు (బాబసాయపేట) నల్గొండ శ్రీరామగిరి శ్రీరాములవారి సన్నిధికి సమర్పించినారు.

ఇట్లు ద్రవ్యసహాయము వస్తుసముదాయములను సమర్పించినవారిని నల్గొండ శ్రీరామగిరి అండాళు సదా ఎల్లకాలములయందు రక్షించుగాక ! ఇక ముందు యెవరైనను అలంకారమునకు ఆభరణములు సమర్పించుకోవచ్చును.

శ్రీయైనమః.



గోదాదేవి

ఓం

# శ్రీ గోదావధూటీ పరిణయము

## ఉపోద్ఘాతము

శ్రీకమలావధూటి యెదజేర్చి పయారముగా వృషాద్రిపై
ప్రాకటమొప్పగా నిలిచి భాసిలు వేంకటభర్త లీల న
స్తోకదయాంబురాశియని దోచఁగ శిప్పనగండ్ల గహ్వరిన్
జేకొనియుండు లక్ష్మినరసింహులు మమ్ములఁ బ్రోవుగావుతన్.

సీ. భాస్వదుత్పలహిత ప్రకటదృగ్గరిమతో
దృఢతటిద్ఘనదేహదీప్తివాడు
గురుజీవనగ్రాహ కుండలరుచులతో
పటుసువర్ణవిచిత్ర పటమువాడు
విమలముక్తాహార వీక్ష్యమండనముతో
శ్రీవరనాభి సంసిద్ధివాడు
తతసహస్రారాబ్జయుత కరక్రీడతో
విపులాభరణకళా వృత్తివాడు

గీ. నాత్మవిలసనపదరూఢి నలరువాడు
ఇందిరాదేవి హృదయారవిందపీఠి
దిరముకొనియుండు వేంకటాధిపుడు మమ్ము
పూర్ణసకలేష్టదాయియై బ్రోచుఁగాత.

చ. హరి కనపాయియౌ కమల హర్షముతోడుత ముజ్జగంబులన్
పరమకృపాసురాగమును భావమునందులఁ గల్గి భర్తపె
న్నురమునఁ గ్రాలు కౌస్తుభము నుయ్యలగా నివసించియుండు యిం
దిరయును మద్గృహంబున స్థిరంబుగ చక్కఁగ నుండుగావుతన్.

సీ. కమనీయమృదుపదాబ్జములు కచ్ఛపలీల
మంబుజంబులు సాంద్రమకరభూతి
కరయుగంబున శుభాకర మహాపద్మాప్తి
పెలుదచన్గవ వరాచలవిభవము
కంఠదేశమున నఖండశంఖసమృద్ధి
దంతపంక్తుల కుందకాంతిమహిమ
ఆననమందు పద్మాహితసంపద
యలకాళి నీలైకవిలసనంబు
గీ. నాకృతి ముకుంద వీక్షణీయాచ్ఛ మొలయ
నపవిధానప్రధాన సౌందర్యరేఖ
నలరి కలశాబ్ధిఁ బొడమిన కలిమికొమ్మ
స్థిరకృపాదృష్టి మమ్ము రక్షించుగాక.

చ. సరసముగాగ ముజ్జగతి సర్వజనంబులు గాంచి మెచ్చగన్
అరిదరఖడ్గశార్ఙ్గగద ఆయుధశ్రేష్ఠము లర్థితాత్మఁదై
సిరివరు డింపుసొంపుగను శ్రీకరమైన చతుర్భుజంబులన్
మెరయుచునుండు సత్ప్రభల మిన్నతి యెంచెద యిష్టసిద్ధికిన్

సీ. శ్రీకరంబగునట్టి శ్రీవత్స కౌస్తుభ
వైజయంతి సమాల్య వైఖ రెంచి
కటకాంగుళీయక కంకణ కేయూర
మకుటాంగదద్యుతుల్ మది నుతించి

కాంచికాగుణ పీతకౌశేయ కుండల
మణిగణ గ్రైవేయ మహిమ లరసి
తపనీయ మంజీర ధాళధళ్యత లెన్ని
వరతారహారాళి సరణి యెంచి
గీ. పతగరాడ్ధ్వజ విభవతఁ బ్రస్తుతించి
అహినగాధ్యక్షునకు కృతి నర్పితముగ
కడుముదంబున శిష్ణసగండ్ల నృహరి
కరుణ రచియింతు బుధజనుల్ గాంచి మెచ్చ.

చ. ధరణిభరంబు మూర్ధములఁ దాల్చుకొనిన్ యతిధైర్యస్థైర్యతన్
హరికిని శ్రీరమాసతికి నర్షసపర్యలు సత్క్రమంబుగన్
కరమనురక్తిగా నెపుడు గైకొని శేయుచు పాన్పు తానయై
గరిమతొ నుండు శేషఫణికాంతుడు మాకు శుభోక్తు లీవుతన్.

గీ. తనువునందు ధవళతరుణారుణచ్ఛవి
పెనగొనంగ దైత్యబృంద మెదలొ
ఘనభయార్తు లగుచు కళవళఁబడఁజేయు
వినతకూర్మిసుతుని విభవ మెంతు.

సీ. సకలకులాచల సంభేదనోదగ్ర
పవిగర్వభంజన పత్రకుండు
కాండౌఘభాండ పిచండిల పుండరీ
కాక్ష విహంగమధ్యాంసతలుఁడు
గండూషకార్య సంఘటిత సప్తార్ణవ
కమలసంపుట ముఖగర్భహ్వారుండు
పూర్వగీర్వాణౌఘ గర్వావలేపహా
నైజగౌరవిభాద్య నఖరయుతుఁడు

గీ. ధవళరుగ్రీవనారుణ తనువిలాసు
రూపపక్త్రియ్యు కీర్తిప్రతాపయుగళు
డాగమోదారమూర్తి విహంగనాథు
డధికశుభమిచ్చి వ్యజనంబు లణచుగాత.

సీ. అబ్జజాండమునందు నసురాంశభవులైన
దుష్కృతౌఘంబుల ద్రుళ్లడంప
సరసిజాక్షునియాజ్ఞ శిరసావహించియు
పరిపంధిజనుల గర్వంబునడచ
కనకరత్నస్థగిత ఘటితవేత్రంబును
సవ్యకరమున బూని సత్వరముగ
దురమున శాత్రవతుముల మేపడగించు
సురలు సన్నుతిసేయ సుస్థిరముగ
గీ. ఇందిరాధీశు సన్నిధియందు నిలిచి
కరములును మోడ్చి భయభక్తి నెరయగాను
విన్నపముసేయుచుండు నిర్విఘ్నయశుడు
సూత్రవతిభర్త మా కొసఁగు శుభకరములు.

మ. సరసీసంభవ భూతనాముని మహాత్థ్సంపూర్ణు భక్తాఢ్యు శ్రీ
హరిచిత్తుఁ, కులశేఖరుఁ, యతిసమూహాగ్రేసరుఁ భక్తపా
దరజఃఖ్యాతుని విప్రమిత్రుతు మునీంద్ర ప్రోల్లసద్వాహనిఁ
తిరుమంగార్యపరాంకుశుఁ మదిని గీర్తింతుఁ వచస్సిద్ధికిఁ.

సీ. అబ్జాక్షపాదుకలంశసంభూతులౌ
శఠజిదార్యమహిమ సన్నుతించి
శ్రీనాథమౌనుల శ్రీపుండరీకాక్షు
పదపద్మములకును ప్రణుతొనర్చి

శ్రీరామమిశ్రుల శ్రీయామునార్యుల
పూర్ణార్యు లంఘ్రుల పూజొనర్చి
రామసోదరు చరణరాజీవయుగళంబు
స్వాంతంబునందున సంస్మరించి
గీ. అఖిలదేశికవరులను అభినుతించి
అస్మదార్యులఁ గొనియాడి యతిశయముగ
విబుధు లర్చింప నీకృతి విశదముగను
రచనగావింతు శిరిశైలరమణు కృపను.

కం. భాసురయశులగు శ్రీశుక
వ్యాసపరాశరుల మహిమ వాసిని యెంతుఁ
భూసురముఖ్యులా మెచ్చఁగ
ఆసక్తత నుతియొనర్తు నాదిమకవులఁ.

చ. ముదముతొ నస్మదీయకుల ముఖ్యకరుండగు శింగరార్యులఁ
సదయతఁగాంచి భారతియు చక్కఁగ వేయు సమస్యభావముఁ
కొదుకకదెల్ప మెచ్చి యటుకూర్మితొ యిచ్చినమాటఁ దప్పకఁ
విదితముగా నహర్నిశము వేడ్కతొ మద్గృహసీమ నుండుతఁ.

క. వికటముగ నుడువు కుకవుల
ప్రకటింపఁ బనేమి యనుచు ప్రౌఢకవీంద్రుల్
అకలంకమతితొ యెప్పుడు
నికటించరు వారిపలుకు నిర్లక్ష్యతగఁ.

చ. అని మఱి యిత్తెరంగు మహదస్మదభీప్సితదైవతావలిఁ
వినుతియొనర్చుచు న్నధికవేడ్కతొ మన్నిజగేహమందునఁ
వొనర సుసుప్తమొందుచును నుండెడునయ్యెడ దేవియారుతో
వనిబడి శేషశైలపతి భాతిగ శిర్సనగండ్లవాసుడై.

చ. ముదముతొ నాదు సమ్ముఖమునందట నిల్చి స్మితాస్యుడౌచు నన్
సదయత డెందమందులను సందిలగన్ యిటు గారవింపుచున్
విదితముగాగ యిట్లనియె వేమరు మిమ్మిటు లింతవారిగా
మదిలోను సంశయించి యనుమానమునొందక విస్మయర్పకా.

మ. అనురాగంబునడాసి మైనిమురుచున్ హస్తారవిందంబు నా
తనువందు న్నిడి పేర్మితో నిమురుచున్ దైన్యం బెదన్ దీరగా
నను లాలింపుచు మందహాసముఖుడై మా కీకృతిన్ యర్పితం
బొనరంజేయుమటంచు బల్కు విని నే నుత్సాహతన్ మేల్కొనన్.

సీ. హర్యక్షనరరూపు నలరుదేహమువాడు
హొంబట్టు జిలుగుపట్టంబువాడు
కమనీయమణిమకుట ఘటితమూర్ధ్నమువాడు
కుదురైనయట్టి ముంగురులవాడు
భాసురంబగు చతుర్బాహువుల్ గలవాడు
పంచాయుధంబులు బట్టువాడు
కౌస్తుభమణిరుచుల్ గ్రాలు కంఠమువాడు
ధవళాబ్జపత్ర నేత్రములవాడు
గీ. పంటపొలతియు సిరి నీళ దంటవాడు
తొంటివేల్పుల గెలచిన వింటివాడు
యెలమి ప్రత్యక్షమై యిట్లు యింపెలర్ప
కలను సాక్షాత్కరించు నా ఘనుని గాంచి.

క. మది ముదమందుచు లేచటు
పదపద్మములందు వ్రాలి ప్రణుతియొనర్పన్
సదముదమునొందగా గని
విదితంబుగ నిట్టులనియె వికసితముఖుడై.

చ. హితమగు భక్తి నీవు రచియింపఁదలంచిన యాప్రబంధము౯
హితమతితో గ్రహింపగను యిచ్ఛవహించెను మాకు గావున౯
కౌతుకకఁజేయుమంచు ననుకూలతఁగా నియమించి వేగ యా
శతదళ పత్రనేత్రు డపు డంత నదృశ్యతయైన నంతట౯.

చ. కరములుమోడ్చి మ్రొక్కి కుతుకంబున యాకృతి సక్రమంబుగా
విరచిత మేనొనర్పగను వేడ్కఘటిల్ల తదాగ్రమందుల౯
శిరసనగండ్ల లక్ష్మనరసింహుల యాజ్ఞమదియ్యనత్కలా
కరులగు దేశికేంద్రులను గౌరవమొప్పు బుధుల్ నుతింపగా౯.

కవివంశార్ణవము

చ. వసుధ పినాకియాఖ్యగల వాహిని యామ్యతటంబు యింపుగ౯
కుసుమధనుష్కజన్కు డతికూర్మితొను౯ నివసించియుండుట౯
అసదృశదివ్యదేశమని యార్యులు యెన్నిరి తిర్వరంగ మిం
పొసగెడు నూటయెన్మిదిలొ యెన్నికయయ్యె మహాప్రసిద్ధత౯.

క. మంగళ దేవతతో శ్రీ
రంగప్పుడు తిరువరంగ రమ్యస్థలిని౯
పొంగుగ నివసించుండెడు
సంగతి బుధజనము లరసి సమ్మోదముతో౯.

సీ. అమ్మహాస్థలమున కాద్యులౌ యాసూరి
యాదికేశవ దేశికాహ్వాయునకు
పట్టియౌ శ్రీనాథభట్టాఖ్యదేశికుల్
ప్రభవించి రత్యంతప్రాజ్ఞులగుచు

యతిసార్వభౌముతో యిల చతుర్దిశలను
విహరించి శ్రీరంగవిభునికడకు
అరుదేర యాస్వామి హర్షించి యందరఁ
గాంచి యిట్లనె మరింగంటి యిటను

గీ. అనుచు నారామసోదరు నరసి యపుడు
ఆనతిచ్చిన శ్రీసూక్తి యన్వయముగ
ఇల మరింగంటివారనే యింటిపేర
యలరె సకలార్యులెల్లను యతిశయిల్ల.

గీ. పదమ ద్రావిడ యాసూరిపంశవార్ధి
ఉడుగణాధ్యక్షుడై వడి నుర్వినందు
పొడమె మౌద్గల్యఋషిగోత్రపుంగవుండు
యనఁగ శ్రీనాథభట్టారకాహ్వయుండు.

చ. అమితప్రభావశీలుఁడగు యగ్గురుకాంతుని గర్భమందులన్
శమదమశాంతహృత్ జ్వరుని సర్వజనంబులు ప్రస్తుతింపఁగా
సుమనసదేశికాకృతిని శోభిలు పిళ్ళగురోత్తమాఖ్యచే
విమతుల గుండెడిందొదవి వేమరు స్వాంతమునందు బెగ్గొనన్.

సీ. అమ్మహానీయుని యాత్మసంభవుడయ్యె
పెరియపిళ్ళాఖ్యుడౌ పృథుయశుండు
జనియించె యాగురుచక్రవర్తికి పేర్మి
శ్రీరంగరాజాఖ్యశేఖరుండు
ఆదేశికేంద్రున కాత్మసంభూతుఁడై
తీర్థవారయ్యనే కీర్తిఘనుఁడు
పేర్మితో యాఘనుకు పెరియజియ్యరు బొడమె
అమ్మహామహునకు యామునేయు

గీ. దనెడు యాదేశికేంద్రున కవతరించి
ధీయుతుండగు మాధవదేశికుండు
యగ్గురోత్తము తనయుఁడై యవతరించె
చన్నయాచార్యుఁ డాచార్యచక్రవర్తి.

చ. జననిసుగర్భమందునను చక్కఁగ దా జనియించు నత్తరిన్
కనుఁగొన నెల్లవారి కహికాంతు కళాంశజుఁడయ్యె నంతటన్
దనరెను మానవాకృతిని తన్వువహించి ప్రియంబెలర్పఁగా
విని కనువారలందరికి విస్మయమున్ మదియందు సంధిలన్.

చ. దశనవసంఖ్యయగ్రజులు తద్దయుపేర్మితొ గారవింపఁగన్
విశదత సర్వవేదములు వేడ్కఁదలిర్ప గ్రహించి చక్కఁగన్
అసదృశశాస్త్రషట్కములు హస్తత స్వాంతత సంగ్రహించిరా
రసికులు మెచ్చ చెన్నగురురాయుఁడు రాజిలె రాజులెన్నగన్.

ఉ. ఆగురురాజశేఖరున కాత్మజులున్ మువు రుద్భవించిరిన్
భోగినగాధ్యసత్కృపను భూరియశుండగు తిర్మలార్యులున్
ఆగమవేత్త భట్టగురు డాఘనుసోదరు శింగరార్యులున్
బాగుగ త్యాగభోగగుణభాగ్యధురంధరులంచు యెంచఁగన్.

ఉ. బంధుసమృద్ధులై పృథివి భాసిలువారిలొ భట్టరార్యకున్
సింధురవైరిసన్నిభుఁడు శిష్టజనస్తుతు డార్తరక్షసం
బంధుఁడు వేంగళార్యుఁడును పన్నగశైలనివాసు సత్కృపన్
కంధిని నుద్భవించిన మృగాంకునికైవడి గల్గె చక్కఁగాన్.

ఉ. ఆ మహనీయమూర్తికిని యాత్మజు లిర్వురు నౌతరించిరొ
తామరసాక్షు సత్కరుణ ధార్మికస్వాంతులు యౌచు ధారుణిన్
సోమదివాకరప్రభల శోభిలు తిర్మల భట్టరార్యులున్
శ్రీమహిళాంశభూతులయి శ్రేయత నొందెదు వారియందునన్.

చ. తిరుమలదేశికేంద్రునకు ధీయుతులౌ తిరువేంగళార్యుఁడున్
సరసుకునౌ నృసింహగురు సద్గుణగణ్యు డనంతదేశికుల్
వరగుణ శింగరార్యులును వారియ నల్వు రఖర్వతేజులై
శరధిని నుద్భవిల్లిన శశాంకునివై ఖరి నిద్ధరిత్రిలోన్.

చ. వరవగు వారిలో విబుధవర్ణితుడౌ తిరువేంగళార్యునన్
తరుణగునట్టి పేర్మి శుభదాయిని శ్రీవరదాంబయందులన్
సరసిజగర్భు నేత్రముల సంఖ్యను సూను లఖండవైభవుల్
వరుసతొ నుద్భవంబయిరి వారల సత్ప్రభ రెంతు తెల్యఁగాన్.

సీ. ఉభయవేదాంతార్థ విభవుఁడై ప్రథులచే
అభినుతుల్ గాంచు శ్రీయప్పలార్యు
విదితమౌ త్రైయంతవిద్యల విద్వాంస
వితతి రంజిలఁజేయు వేంకటార్యు
పరవాదికుమతుల భంజించి వాదున
చెన్నొందు శ్రీనారసింహఘనుఁడు
చౌషష్టివిద్యల షప్పన్నభాషల
రాణించు కోనేటిరాయశౌరి

గీ. జగ్గగురుకాంతు డపధానచక్రవర్తి
ఆశుకవియగు శ్రీశింగరార్యఘనుఁడు
రంగనరశింగరార్యులు రాజసభల
గణుతికెక్కిరి షట్ప్రాప్తఘటికు లగుచు.

మ. నరనాగాశ్వనృపాలశేఖరులు నానారత్నభూషావళుల్
తురగాందోళికఛత్త్రచామరతతుల్ తోరంబుగా నివ్వగన్
శిరు లింపొందుచు వాడపల్లినగరిన్ చెన్నొందుచున్నట్టి శ్రీ
నరకంఠీరవు కోవెలస్థలికి స్థానాచార్యులై యుండెటున్.

సీ. అమ్మహీమండలి కాధ్యులౌ పరివృఢుల్
హర్షత తమ నటు నాశ్రయించు
వేకను యాతవాకిళ్ళనె గ్రామంబు
అగ్రహారంబుగా నటు మొసంగ
అతివేడ్క వారలు నాలయంబుగ నిల్చి
యధికసంపన్నత యలరుచుండు
శతఘంటసుల్తాను చక్రవర్త్యను ఖ్యాతి
దీపించు శింగరదేశికునకు
గీ. అమితవిద్యావిశారదు డనుచు సభల
నతులుగావింతు వేంకటనారసింహు
గురుడు క్షీరాబ్ధి బొడమిన కువలయాప్తు
కరణి ప్రభవించె బుధజనుల్ గణుతొనర్చ.

ఉ. ఆగురురాజసింహునకు నాత్మజుడై ప్రభవించె చక్కగన్
భోగివరాఢ్యు సత్కృపను పొల్పగు వేంకటపెద్దదేశికుల్
బాగుగ యమ్మహామహుకు పన్నగరాజనిజాంశభూతులై
ఆగమవేత్తలౌ సుతులు హర్షత ముమ్వురు నుద్భవించిరిన్.

గీ. శ్రీజగన్నాథ నరసింహ సింగరార్య
లనెడువారల ముపురిలో నగ్రజునకు
రమ్యశుభగాత్రు వేంకటరాఘవార్యు
డవతరించెను యాదేశికాహ్వయునకు,

గీ. శ్రీనివాస జగన్నాథ శింగరార్య
లధికవిద్యాధికారత కాధ్యులగుచు
సకలదిగ్దేశ నృపసభల్ సన్నుతింప
ప్రణుతికెక్కిరి యత్యంత ప్రౌఢు లగుచు.

చ. అరయగ వారిముప్వురిలొ నార్యనుతుండగు శింగరార్యుకున్
సరసుడు వేంకటార్యులును సద్గుణగణ్యుడు భట్టరార్యులున్
సరసవధూటిగర్భమున సవ్యశుభాంగులునౌచు నుర్వరన్
సురగురుభాతి ప్రాజ్ఞతను శోభిలుచుండెడు వేంకటార్యకున్.

చ. తరుణగు లక్ష్మమాంబకును ధన్యయశస్కుఁడు వేంకటార్యులున్
శరనిధి నుద్భవంబగు శశాంకుని పై ఖరి నౌతరించి భా
సురయశుడంచు బంధుజనస్తోమము సన్నుతిసేయ చేతనుల్
అరుసమునం బదాబ్జములయం దతిభక్తితొ నాశ్రయించఁగన్.

సీ. శ్రీరమామణియైన సింధురాట్సుతిమాడ్కి
యఖిలచేతనతతి కాశ్రితుండు
తార్క్ష్యతురంగుని దళవాయిపై ఖరి
పరవాదిమదధ్వాంత భాస్కరుండు
శఠజిదాగమ ద్రవిడసాంప్రదాయార్థముల్
తెలుపుచుండెడునట్టి దేశికుండు
రామసోదర యతిరాజ సిద్ధాంతుఁడై
పరవాదిముదిరప్రభంజనుండు.
గీ. ననుచు బుధకోటినిచయముల్ యతిశయింప
శ్రీమరింగంటి వంశాబ్ధి శీతకరుఁడు
శింగరాచార్య సత్పౌత్రశేఖరుండు
యనఁగ విలసిల్లె శ్రీవేంకటార్యమౌళి.

క. పొంగుచు నగ్గురుమణియున్
శృంగారతరంగిణట్ల శోభిలుచుండెన్
మంగళదేవత కెనయగు
రంగాంబను దా వరించె రాజితయశుఁడై.

క. వారిరువురి గర్భంబున
సూరిజనుల్ బ్రస్తుతింప శుభగుణయశులై
నరసింహప్పలశింగర
వరనామంబులను మిగుల పర్ధిలితి మిలన్.

క. అలమేలుమంగప్రియకరు
డలరుచు మా యిష్టదైవమై యతిపేర్మిన్
బొలుపుగ శింసనగండ్లా
చల శిఖరాగ్రమున నారసింహాకృతిగన్.

చ. స్థిరముగనిల్చి మాకెపుడు దివ్యసుసౌఖ్యతమైన సంపదల్
పరమకృపాపరత్వమున భావమురంజిలఁగా నొసంగగన్
సిరిసతి స్తన్యపానమున జెందిన పుష్టిని యీప్రబంధముల్
సరసముగా రచించెదను సత్కవిదేశికు లుత్సహింపఁగన్.

గీ. అస్మదన్వయసంభవులైన ముఖ్య
జనవరేణ్యుల మహిమలు సన్నుతించి
పూజ్యుపేరొప్పు షష్ఠ్యంతములను కృతికి
నధిపుకభ్యుదయంబగునటు రచింతు.

## షష్ఠ్యంతములు

క. శ్రీలలనకుచవిరాజిత
లాలితమృగమదవిలాస లక్షణవక్ష
స్థాలేయ శుభకరాశ్రిత
హేలా ధౌరేయయోగ హితవరదునకున్.

క. హరి దర పారద శారద
శర నీరద హీర తార శంకరశైలా

ధర హిమ వాలుక చందన
వరకీర్తి సుదామ భక్తివర్ధను కెలమిన్.

క. విషచర గిరిధర భూధర
వృషభిక్షుకద్విజవరామ వృగధరదేహా
విషధరపథచరపట్టణ
విషనాశన బౌద్ధ కల్కి విభవాంగునకున్.

క. హాటకకశ్యపనామ ని
శాటక పక్షఃకవాట శాసితశరభా
సాటోప నిరసనాయత
హాటకనగతుల్య వైర్య హర్యక్షునకున్.

క. స్ఫారానల కీలోజ్వల
ధారాంచిత చక్రనిహత ఘాటీయుత బృం
దారకరిపుమండల సం
హారవిహారకవినోద హరిశయనునకున్.

క. శిరిహృదయ కమలసంభవ
పరమధురాసక్తచిత్త వైభవ నిందిం
దిరరూపవిభవశోభిత
శిరసనగండ్లాద్రి నారసింహ ప్రభుకున్.

వ. అంకితంబుగా మదియ్యాన్వయాభీష్టదైవంబగు శ్రీమద్వేంకట లక్ష్మీ నృసింహుల కనవరతశోభనపరంపరాభ్యుదయంబగునట్లు సమర్పితంబుగా నాయొనర్పంబూనిన శ్రీభాష్యకారోక్తముక్తావళియగు గోదా పిరాట్టి యభ్యుదయం బను మహాప్రబంధ మందారప్రసూనదామంబుకు కథాక్రమం బెట్టిదంటేని,

ఓం

# శ్రీ గోదావధూటీ పరిణయము

## ప్రథమాశ్వాసము

### క థా ప్రా రం భ ము

సీ. అఖిలాండకోటి బ్రహ్మాండ భాండాతీత
మై శాశ్వతంబుగా నమరు పదము
చంద్రసూర్యానల జ్వాలమాలికలచేఁ
నలరారుచుండెడినట్టి పదము
సాలోక్య సారూప్య సామీప్య సాయుజ్య
ములు నొసంగెడునట్టి ముఖ్యపదము
అబ్ధిరాట్కన్యక కాటప ట్టగుచును
పొలుపొందుచుండెడి భోగపదము

గీ. లలితరూపానురూప కాలత్రయ పరి
మాణ వర్జిత దేదీప్యమాన నిర్వి
కార నిత్య నిరంజనాకార మా త్రి
పాద్విభూతాత్మసుఖమగు పరమపదము.

చ. అతులిత మోక్షలక్ష్మికిని యాస్పదమైన త్రిపాద్విభూతినిఁ
సతతము నిత్యసూరిజనసంఘములెల్ల తదేకనిష్ఠచే
హితవుగ స్నానసంధ్యలును యింపుదలిర్ప నొనర్చునట్లుగఁ
చతురత నిందిరాధవుడు సత్కృపచే విరజాప్రవాహినిఁ.

క. ఇంపుఘటిల్ల సృజించిన
సొంపుగనఁ ముక్తిజనులు సుస్థిరమతులై
గుంపులుగూడుక తరగని
సంపదలఁ న్నుందు రెపుడు సౌఖ్యాన్వితులై.

క. అరయగ యా విరజానది
విరివిగ కావేరియగుచు విదితముగాగఁ
ధరణిని చోళోర్వీస్థలి
స్థిరముగ ప్రసరించె సకలదివిజులు యలరఁ.

వ. అమ్మహాప్రభావగుణగణ్యంబగు యమ్మహాతరంగిణీ మధ్యభాగంబున.

సీ. శ్రీకరంబగు ధర్మదివ్యసన్మణిగణ
నిర్మితం బగునట్టి హర్మ్యములచె
చారుతరంబగు శాతకుంభోజ్వల
వరపైన మరకత వప్రములచె
ధగధగత్కాంతుల దళుకొత్తు దర్పణ
స్థాపిత గేహాలి ద్వారములచె
బాలభాస్కరద్యుతుల్ భాసిల్లు మణిహేమ
నికరంబు లగునట్టి నిలయములచె
గీ. ముఖ్యకరమగు త్రైలోక్యమునను బోల్ప
నసదృశంబైన విభవత నెసగి విబుధ
తతులు నుతిసేయ వైకుంఠధామ మట్లు
ధరణిఁ జెన్నొందె శ్రీరంగధామ మనఁగ.

శా. శ్రీవైకుంఠపురాధ్యుఁడైన హరియే శ్రీరంగశాయై భువిఁ
దేవజ్యేష్ఠుని యిష్టదైవమగుచుఁ దివ్యప్రభావోన్నతి
న్నావిర్భూతుఁడు నయ్యు చేతనతతి న్నత్యంత మోదంబుతో
గావఁ దీక్షవహించి నిల్చి యటుఁగా కావేరిమధ్యంబునఁ.

సీ. దినకరశతకోటిదీధితుల్ పెనగొను
మహనీయ దివ్యవిమానమందు
శ్రీభూమినీళాది సీమంతినులతోడ
శేషాహి మృదుభోగ శయ్యయందు
ఆరూఢుడై నిల్చి యఖిలజగంబులు
చక్కఁగా పాలించు సమయమందు
ముదముతో తిరువాయిమొఴి మంటపంబున
కరుదెంచి యతినేత కతిశయముగ
గీ. వినుతిఁగావించి శ్రీరంగవిభు పదాబ్జ
ములను సేవించి తదనుజ్ఞమూలకముగ
సకలదేశికప్రతతితో సన్నిధందు
శేముషలరంగ గూర్చుండి శ్రీశుమహిమ.

గీ. ఆనతిచ్చుచు నుండెడి యవసరమున
విని తదీయాఘమెల్లను వికసితాబ్జ
వదనులగుచును నత్యంత వైభవమున
ఉదయవరు సన్నిధందుల యుండునపుడు.

క. నిబ్బరమున తమమనసున
నుబ్బరమందుచును వినియు యనురాగమునన్
దెబ్బదినలుగురు దేశికు
లుబ్బుచు నిట్లనిరి యధికయుత్సాహముతోన్.

గీ. అస్మదాదుల మానసమందు గల్గు
సంశయార్థంబులెల్ల మీ సన్నిధందు
విన్నవింతుము మీమది విశదముగను
ఆనతిమ్మన్న యతిరాజు హర్షమంది.

ఉ. మీ తిరువుళ్ళమందు నుదయించిన సంశయమెయ్యదో యదిఁ
యాతెరఁగెల్ల చక్కఁగను నానతి నిమ్మన యమ్మహామహుల్
ప్రీతమనస్కులౌచు కడు పేర్మి ఘటిల్లఁగ సాగిమ్రొక్కుచుఁ
చేతులుమోడ్చి సన్నుతియు సేయుచు నిట్లని రైకవాక్యతఁ.

సీ. అఖిలాంతరాత్మయౌ నాదిపరబ్రహ్మ
చిదచిదాత్మకుఁడౌచు చిద్విలాస
మలర చతుర్వ్యూహమందున వ్యాపించి
లీలావిభూతిలో మేలిమిగను
పొలుపొందుచుండెడి పుణ్యావాహినులందు
యర్చావతారత నవతరించి
శిరి భువి నీళలు శేముషు లలరంగ
యనురక్తి నిరుగడలందు నిల్చి
గీ. భక్తి పరిచర్యసేయఁగా భావమందు
ముదమునొందుచునుండెడి మురవిదారి
ముఖ్యకరమైనవారల ముపురికన్న
నధికసంప్రీతి శ్రీగోదయందు చాల.

గీ. కలిగియుండుట నిదియేమి కారణంబొ
యనుచు మా డెందమందున నహరహంబు
పెనుగుచుండెడికతనచే పేర్మి మీచె
నత్తెరంగును విన వేడ్కనయ్యె మాకు.

క. ఇవ్వరపద్మల ముగురుని
నెవ్వరియంశమునఁ గోద యేయనఘునకు
న్నివ్వసుధయందు బొడమెను
నవ్విధము సవిస్తరముగ నానతినియుఁడీ.

చ. అని యిటు తత్త్వభాసదులునైన తదీయులు దేశికేంద్రునిన్
గని వినయానురాగమున కౌతుకమందుచు విన్నవింపఁగన్
విని దరహాసవక్త్రుఁడయి హృద్యమునందుల సంతసింపుచు
న్ననఘుఁడు విష్ణుచిత్తముని యాత్మజ వైభవ మెన్నఁగల్గెనిన్.

చ. అలరుచు పూర్ణదేశికుల యంఘ్రియుగంబులు స్వాంతమందునన్
నిలుపుక సంస్మరింపుచును నెయ్యముసంధిల భట్టనాథునిన్
తలఁపున చక్కఁగానిలిపి ధాత్రి పిరాట్టి నిజాంశభూతయై
తులసిద్రుమౌఘమధ్యమున తోయజనేత్రు నియామకంబునన్,

చ. జననమునైన యత్తెరుఁగు చక్కఁగ నప్పుడు లక్ష్మణార్యులున్
తన మదియందు గ్రాహ్యముగ తాల్మితో యోజనఁజేసి వారలం
గనుఁగొని యానుపూర్వకముగా వచియింపదలంచి మీరలున్
వినవలశించె కావునను వీనుల కింపగునట్లు నేడిటున్.

వ. అని యిట్లు దర్వీకరాధ్యక్షు నిజాంశసంభూతుండగు రామానుజార్యులాంతర్యంబున శ్రీవిష్ణుచిత్తాత్మజయగు గోదాపిరాట్టి యభ్యుదయంబు గ్రాహ్యంబుచేసుక కూరేశదాశరథ్యాది చతుస్సప్త దేశికవ్రాతంబుల అత్యంతకరుణాకటాక్ష వీక్షణంబుల నవలోకింపుచు మృదుమధుర గాంభీర్యోక్తులు నెరయ సవిస్తరంబుగా మెల్లన నిట్లనియె.

చ. చతురత ముజ్జగంబు లలి జాగరతన్ పొలుపొంద నేలెడిన్
శతధృతి శంకరాద్యమరసంఘము లారసి ప్రస్తుతింపఁగన్
ధృతియునుఁ జాలకం దిశల తెమ్మెర వైఖరి సంచరించఁగా
అతులితదివ్యభోగముల కాస్పదమైన త్రిపాద్విభూతినిన్.

సీ. పొలుపొందు పైకుంఠపుటభేదనంబున
దినకరశతకోటి దీప్తు లలరు
నంతఃపురాస్థలి హర్మ్యాగ్రమందున
మరకతమణిఘటిత మంటపమున
శిరి భువి నీళాది సీమంతినులతోడ
సరసవిద్యాసక్తు డగుచు హరియు
పుర బహిర్ద్వార సత్పరిపాలకుల( గాంచి
మాయాజ్ఞ యగుదాక మరియు మీరు
గీ. యంతవారలనైన నీయంతిపురము
చొచ్చిరాకుండ యుండుడి యిచ్చ టనుచు
యాజ్ఞ నిడినంత వారలు యట్ల(గానె
నిలిచియుండిరి యత్యంతనియతితోడ.

వ. ఆసమయంబున సనకసనందన సనత్కుమార సనత్సుజాతాది మహాఋషిసంఘంబులు ప్రాకృతబాలకాకృతింగైకొని దిగంబరులై అవ్యక్తంబులాడుచు బాడుచుఁ హరిమందిరాంతఃపురద్వారంబు( జొచ్చిన వారలఁ దవ్వారికులైయుండు జయవిజయులు వారలయంతర్భావాతిశయంబులు యెరయంజాలక ప్రాకృతబాలకులని గదాదండంబులు సారించి దుూశించుచు పారందరిమిన వారలు గినిసి స్వస్వరూపధారులై మీరు హరిమందిరద్వారపాలకులైయుండుట కర్హులుగాక మర్త్యలోకంబున దాక్షిణ్యరహితులై దానవాకృతిఁ జనియించుండని శాపంబిచ్చిపోయిన యనంతరంబ.

ఉ. చారులు వచ్చి యివ్విధము శార్ఙ్గధనుర్ధరుతోడ( దెల్ప(గఁ
ధోరున సత్తెమాడుటకు బుద్ధిలొ( బోల్చక లేచి తూర్ణతఁ
వారల( జేరగాబిలిచి వారని పేర్మితొ గారవించె నే
కారణ మిట్లుయయ్యె నగుకార్యము దీర్ప నశక్య మేరికిఁ.

ఉ. మానియమప్రకారమున మందిరద్వారమునందు యప్పుడుఁ
పూనుకయుండుటల్ యరసి పుష్పధనుర్ధరు భ్రాతృసూనులుఁ
మానసమందు నోర్వకను మానవశాబకు వేషధారులై
పూనుకవచ్చి మిమ్ము నిటు ఘూర్ణలమందుల రాక్షసాకృతిఁ.

చ. ధరణి జనించుడంచు యతిదారుణశాప మొసంగిపోయిరిఁ
మరలపశక్య మింతటను మర్త్యమునందుల మీనిమిత్తమై
నరతనువంది వైరమున నమ్రతఁగాగ త్రిజన్మముఁ యిలఁ
సరగను తీర్చివచ్చెదను స్వాంతమునందుల చింతమానుడీ.

చ. అన విని వారు సంతసిలి యట్టిదశాకుచె నాజ్ఞగైకొనిఁ
చని యిల కశ్యపాఖ్యజటి సాధ్వియునౌ దితిగర్భమందునఁ
ఘనభయదాకృతిఁ కనకకశ్యప కార్తస్వరాక్ష యాఖ్యలఁ
జననమునొందిరిఁ దివిజసంఘము కెల్లను వైరులై కడుఁ.

వ. ఇట్లఖిలజగద్భయంకరాకారవిగ్రహులై అత్యంత ఘోరంబుగా దారుణ కర్మంబులొనర్చుచు త్రైలోక్యజనకంటకంబుగా మహీతలమండలంబు వలయాకృతిఁ ముడిచి మూపునం దిడుక హిరణ్యాక్షుండనువాడు రసాతలంబునకుఁ జనునెడ ధరిత్రీలలామంబు యాదైత్యబాధకోర్వం జాలక జగద్వల్లభుంగూర్చి మొరయిడ నార్తజనరక్షకుండైన యమ్మహామహుండు యజ్ఞవరాహరూపంబున వాని కెదు రోహటించి శతచ్ఛిద్రంబుగా వానిగాత్రంబుఁ జెండివైచి వసుంధరాతలంబు యప్పటి యట్లఁ విశదంబుగా నిలిపిన సేదఁదేరి విసంజ్ఞతఁ దెలిసి స్మితవదనారవిందయగుచు ఉపగూహనంబు గావించి వాక్ప్రసూనోక్తులఁ పూజించిన సంతుష్టాంతరంగుండై నీయభీష్టం బెయ్యది యిచ్చెద వేడుమనిన నవ్విపులావధూతిలకంబు మెల్లన యిట్లనియె.

ఉ. దేవ మదీయమాన్యము విశిష్టము మహాసుభాష శ్రీ
భూవలయంబునం దిది యనిష్టముగాఁ దోచమిగాని మది నా
భావమునందు లక్ష్యము పొల్పుడియుంచెడి కోర్కె దీర్చుచున్
త్రోవ తలంపఁగల్గినను దొల్పువరిష్ఠగఁ విన్నవించెదన్.

వ. అది యెయ్యదం టేని.

చ. గతమగు పూర్వజన్మకృతకర్మచయంబులు బాసి చేతనుల్
హితమగు మీపదాబ్జములయం దతిభక్తితొ సంస్మరింపుచున్
అతులితమైనమోక్షమును కర్తలు యయ్యెడు పద్ధతెయ్యదో
శతదళపత్రనేత్ర యది చక్కఁగవేడెద యానతీదగున్.

క. మీమది కిష్టం బెయ్యది
నామది కది యిష్ట మరయ నగధర వినుమీ
యేమి విధించెదఁ బ్రోవఁగ
సామివిగద యానతిమ్ము సర్వజ్ఞనిధీ.

చ. అని యిటు గహ్వరీలలన యాస్తుత చక్రితొ విన్నవింపగన్
మనమున సంతసించి యతిమక్కువ నెక్కొన గారవించి యా
వనజదళాక్షు డిట్లనియె వానికిఁ బేర్మి ఘటిల్ల గన్గొనిన్
ఘనమధురోక్తి నిట్లనియె కర్ణరసాయముఁగాగ నమ్రతన్.

వ. విను మదీయనివాసంబగు త్రిపాద్విభూతిమధ్యస్థితినుండు పరమపద
నామపుటభేదంబునకున్ దిగువ క్రీడావిహారార్థంబుగా కల్పితంబైన
లీలావిభూతియను ప్రకృత్యావరణంబున నుద్భవించు బ్రహ్మక్షత్ర
వైశ్యశూద్రస్థితాశేషనరనారీవర్గంబులు కృతకృత్యులై ముముక్షుర్థ

లగునట్లు శ్రుతిస్మృతిశాస్త్రపురాణేతిహాసాదులు ఏచియించిన యవి సద్గురూపదేశంబున నియతినిష్ఠాతిశయంబుల నైహికాముష్మిక విర హితులై ఈషణత్రయ అరిషడ్వర్గ పంచేంద్రియాది సప్తవ్యసనం బులఁ జిక్కుఁబడక సత్వగుణసంపన్నులై కర్మజ్ఞానభక్తి ప్రపత్తి యుక్తుల– అనవరతభగవద్భాగవతాచార్య కైంకర్యాసక్త చిత్తులగు తదీయులు మదీయసామీప్యసాలోక్యసారూప్యసాయుజ్యంబులు సలక్ష ణంబుగా సంభవించు; అందు కర్మజ్ఞానానుగుణ్యంబులగు షోడశ మహాయోగంబు లాచరించువారలకు క్రమక్రమంబునఁగాని సద్యో ముముక్షత సంభవించుట దుర్లభంబు; జ్ఞానప్రపత్తియోగయోగద్వయం బులు స్థితాశేషచేతనవ్రాతంబులకు సులభంబుగా సద్యోన్ముక్తులగు దురు; అదియెట్టిదంటేని మదీయావతారచరిత్రంబులు ప్రబంధపద పద్యగీతంబులు సంతతస్మరణానురూపకంబుగా ఏచియించి వచించు వారలు భక్తియోగు లనంబడుదురు; శ్రీతులసీదళమల్లికాదిప్రసూన మాలికాగుచ్ఛాది కైంకర్యంబుల కేవలమదీయాభీష్టులగుదురుం గావున నేనర్చావతారస్వరూపకుండనై కొననౌధరింతు నీవును ఏత త్ప్రకారంబుగా మర్త్యంబున చరరూపధారివై జనియించు. నట్లు గావింపుమని అత్యంతప్రియానురాగంబున విశ్వంభరుండు విష్ణు లాంగనావధూతిలకంబునకు సమస్మకంబుగా యానతిచ్చెనని శ్రీమ ద్రామానుజాచార్యం డఖిలభాగవతనిచయంబులకు ఆనతిచ్చిన వార లత్యంతవిస్మితాశ్చర్యభావులై అవ్వలికథాకర్ణనాసక్తులై, యతిరాజుం గని పునఃప్రాంజలులై యిట్లనిరి.

ఉ. ఏమహనీయు నన్వయము యెందును యేనగరంబునందులఁ
యేమహిమప్రభావమున యిందిర వల్లభభర్తగాగనుఁ
యేమితపంబుజేసె భువి యెందుల నిష్టతొ మానవాకృతి
న్నామహిమంబు మాకు తమ రానతియిచ్చి కృతార్థఁజేయుఁడీ.

క. ఇల కృతత్రేతా ద్వాపర
ముల భూసతి ఎట్టిరూపు బుట్టి ముదంబుఁ
నళినాక్షు విష్ణు మగడుగ
నలరి వివాహంబు జరుగునట్టి తెఱంగుఁ.

క. సాకల్యంబుగ నాకథ
మాకుఁ మీ రానతిచ్చి మన్నింపఁదగుఁ
లోకోత్తరంబుఁగాగను
భూకాంతవిలాస మార్యపుంగవ చెపుమా.

చ. అనఁగ స్మితాననుండగుచు హర్షముతోడుత రామసోదరుం
డనుపమస్వాంతతఁ యపుడు సందరిలుఁ విని మోదమందగఁ
వనద గభీరమాధురస వాగ్విభవంబుల తత్సభాసదుల్
దనర వచించె నిట్లు కడు ధారుణీకాంతచరిత్ర వింతగాఁ.

ఉ. త్రేతయుగాంతపాదమున దివ్యతరంబగు కాంచనాద్రికిఁ
ఈతలయామ్యభాగమున నింపుగ జంబుద్రుమాఖ్యదీపమం
దాతతశక్తి రంజిలెడునట్టి ఘువిఁ భరతాఖ్యఖండముఁ
ధాత సృజించె భూరమణి ధామమునౌనటు పాండ్యమండలిఁ.

చ. అనియెడు దేశమందునను అబ్జభవాజ్ఞను విశ్వకర్మనే
యనఘుఁడు చిత్రకౌశలత నార్యజనంబులు గాంచి మెచ్చగఁ
ఘనతర రత్నసంఘటిత కాంచనగోపుర సౌధగేహముల్
తనకరకౌశలంబున యథావిధిగా రచియించె నేర్పునఁ.

సీ. శారికా శుక పిక సారంగ కలహంస
బర్హిసంఘము కాటపట్టుగాగ
పరివృత కిసలయ పరిపక్వఫల సుమ
కలితమై రంజిలు గహనచయము

కలశపాథోరాశి కైవడి చెన్నొందు
వాపి కూప తటాక వ్రాతములను
కనకరత్నాది సంఘటితమై విలసిల్లు
మహనీయతరమైన మందిరములు
గీ. పరమవైదిక నైష్ఠిక బ్రాహ్మణులును
సత్వసంపన్ను లగునట్టి క్షత్రియులును
యుచితసద్గుణగణ్యులౌ యూరుజులును
హరిపదధ్యాననిరతులౌ నంఘ్రిభవులు.

చ. అనిశము నప్పురీవరము నందులను న్వటపత్రశాయియై
దనరెడు శ్రీరమాధవుని తత్పదపంకజయుగ్మము న్మదిన్
ఘనతగ సంస్మరింపుచును కౌతుకతన్ సకలోపచారమున్
వినయముతో నొనర్చుచును వేడ్కఁ దొనుందు రహర్నిశంబులున్.

చ. తరుగని దివ్యసంపదల దారసుతాది సమస్తబంధుపుల్
విరివిగ మందిరంబులను వేడ్కఁదలిర్పఁగ నించియుంచియున్
శిరిధవు సచ్చరిత్రములు శేముషియందుల బ్రస్తుతింపుచున్
యరమరలేక నొప్పుదురు హర్షముతోఁ ముత స్వప్రకాశతన్.

గీ. అఖిలదిగ్దేశవాసులౌ యార్యులెల్ల
వినుతిగావింప యత్యంతవిభవముగను
దనరె శ్రీవిల్లిభుత్తూరు ధన్వినామ
పురవరంబనె యాఖ్యచే పృథివియందు.

చ. అవనిలలామ యన్నగర మందు జనించిన నిత్యసూరికా
నివహములెల్ల ముందుగను నెయ్యమెలర్పఁగ వచ్చి యప్పురిన్
కవగొని నుద్భవంబుయగుకైవడి వైష్ణవజాల మెల్లనున్
అవిరళమౌ ప్రమోదత యహర్నిశి యాహరి దండబాయకన్.

ఉ. ఉండెటి యానసమూహములౌ యుర్విసురోత్తముడౌ ముకుందుకు
న్నండజనేతయౌ వినతయాత్మజుడుఁ హరియాజ్ఞ యిమ్మహీ
మండలియందున న్మిథునమాసము స్వాతిని ధన్వసత్పురిఁ
పండితవర్యులెల్ల గని భావమునందుల సంతసింపగఁ.

క. పుడమిని పురశిఖరాఖ్యనె
కుడియందు ముకుందనామ గురువర్యునకుఁ
పడతియగు పత్తియారుకు
పొడమెను భట్టాఖ్యమౌనిపుంగవు డెలమిఁ.

గీ. అనుదినప్రవృద్ధుడై భట్టనాథుండు
యితరశాస్త్రగ్రహణ కిచ్చపడక
మది నహర్నిశంబు మనుమంత్రరాజమౌ
ద్వయమె తారకముగ నియతమతితో.

సీ. సతతంబు వటపత్రశయను సన్నిధియందు
నతిభక్తితో నిల్చి యతిశయముగ
మనసున వాక్కున మరుపు యించుకరేక
సుప్రసూనపు శరుల్ సొంపెలర్ప
ననుదినంబును దెచ్చి యర్పింపఁ నొకనాడు
నతికృప శ్రీవిభు డతనిఁ గాంచి
మందహాసత నెరయ నిందిరతో ననె
యిమ్మహామహునిచే యేను నిపుడు
గీ. కుమతమతులైన విద్వాంసగుములనెల్ల
వాదమున గెల్చివచ్చెడి వాక్పటుత్వ
మహిమ నెరయంగసేతు యిమ్మహిజనంబు
యరసి విస్మితస్వాంతులై నరయునట్లు.

చ. అని యతిగౌరవంబునను యబ్జదళాక్షుడు భట్టనాథునిన్
కనుగొని నీవు నేడు మదికంపమునొందక పాండ్యభూవరున్
మనసుననుండు పున్మలిక మాన్పఁగ నీవతిసత్వరంబుగన్
చనవలసిందియన్న విని సంశయమందుచు యూరకుండినన్.

క. ఇందిరవల్లభు డాఘను
సందేహము దీరునట్లు సౌజన్యముగన్
మందస్మితాస్యు డగుచును
పొందుగ నిట్లనియె నఖిలబుధహర్షమునన్.

సీ. భయమేల విను పత్స పాండ్యభూరమణుండు
మధురలో పరతత్వమహిమ నరయ
త్రైవిద్య నిర్ణయ త్రైమత సిద్ధాంతి
విద్వాంసనిచయముల్ విదితముగను
కనుగొన వెయ్యారు కనకనిష్కంబులు
బంధురముగ సభాభవనమందు
శుల్కంబుగాగట్టి సురుచిరంబుగ మీరు
పరతత్వనిర్ణయపరచి నిదియు
గీ. గైకొనుండన్న వా రర్థకాంక్ష మదిని
పెనుగొనంగను వాదముల్ బెట్టిదముగ
పదరుటయెగాని పరతత్వభావ మొకడు
యరయలేకున్నవా రటు యదియుఁగాన.

ఉ. కావున నీవె నేనెయయి గహ్వరినాథుని భావమందులన్
కావలసున్న యర్థముల కావిరిదీరఁగ దేల్చి చక్కఁగా
రావలసింది యంచు యనురాగము సంధిల భట్టనాథుతోఁ
తోయజపత్రనేత్రు పరితోషితుడౌ చటు యానతిచ్చియున్.

మ. తన పర్యంకము శంఖకాహళములుఁ దచ్చామరచ్ఛత్రముల్
తనభూషాంబరకుండలాంగదములుఁ దత్సేవకౌఘంబులు
న్ననురక్తి న్నటు భట్టనాథుతొ మహాహర్షాన్వితస్వాంతతఁ
వెనువెంటఁ జని రిట్లుగా మధురకుఁ విద్యావివాదార్థులై.

క. హరిచిత్తమనియు నలరుచు
పరిభవముగ యిట్లు రాగ పాండ్యుం డరసిఁ
యరుదంది యెదురుగాఁ జని
కరయుగములు మోడ్చి మ్రొక్కె కౌతూహలతఁ.

క. హర్యంకపీఠమందున
తిరముగ నాసీనుఁజేసి ద్విజులెల్లఁ గనఁ
పరిచర్యవిధు లొనర్చియు
సరసత నిట్లని వచించె సౌమ్యత్వణితిఁ.

క. వటపత్రశాయి తమరై
యిటు వచ్చుటవలన నాదు నీప్సితమెల్లఁ
ఘటియింపఁగల దటంచును
స్ఫుటముగ యగుననుచు ననియె సొంపుదలిర్పఁ.

ఉ. అంతట తత్సభాసదనమందున నుండెడి పండితౌఘముల్
రంతులుసేయక న్మదిలొ రాగిలుచు న్వదిగుండువారలఁ
స్వాంతమునందునఁ గలుగు సంశయమెల్లను దీరునట్లు వే
దాంతమునందునఁ గలుగు ధార్మికపద్ధతి దీర్చి చెప్పుచుఁ.

క. శ్రుతియు పురాణ స్మృతులలొ
క్షితి మును శాసింపఁబడిన సిద్ధాంతములఁ
జతురతను భట్టనాథుఁడు
హితమతి శాసించె బుధులు నిచ్చలు మెచ్చఁ,

ఉ. పరబ్రహ్మత్వము విష్ణుగాక యితరుల్ భావింపఁ గారంచునున్
హరిచిత్తుం డటు పాండ్యభూరమణుతో నాస్థానమందు న్ననన్
సురలాసూక్తుల కుత్సహింపుచు మదిన్ సూనాల వర్షింపఁగా
మొరశెన్ దుందుభితూర్యరావము లటున్ మోదంబు సంధిల్లఁగాన్.

వ. అయ్యవసరంబున.

క. దిట్టముగ నత్సభాస్థలి
పట్టాంశుకమందు లెస్స బంధించి యటున్
కట్టిన విద్యాశుల్కము
పట్టెడలియు భట్టనాథు పదములవ్రాలెన్.

సీ. ధన్యోస్మ్యనైతి నాతలపులోఁ గల కోర్కె
ఫలియించె మీకృపన్ పరమపురుష
అన్యథసేయక నడియేనిఁ జేపట్టి
కృతకృత్యుఁజేయుమీ గురువరేణ్య
యని విన్నపముసేయ హర్షించి హరిచిత్తు
డనురాగ మెద నొద వతని కపుడు
పంచసంస్కా రార్థపంచక జ్ఞానంబు
కృపఁజేసి యత్యంతకూర్మి నెరయ

గీ. నగ్రశిష్యునిఁగా నేలినంత నతడు
అతులితంబైన మణిభూషణాంబరముల
పూజగావించి యతిభక్తి పొలుపుమీర
రూఢిగాగను సామజ రూఢుఁజేసి.

చ. ముదముతొ తూర్యనాదములు మ్రోయగనున్ తిరువీథులందునన్
విదితముఁగాగ యంద ఱతివేడ్కతొనున్ వెనువెంటఁ గొల్చిరా
త్రిదశులు యిచ్చమెచ్చఁగను దివ్యమహోత్సవ వైభవంబులన్
కదలియు ధన్వినామపురి గ్రక్కునఁ జేరఁగనేగి రింపుగాన్.

క. అరుదెంచు భట్టనాథుని
యరసటు వటపత్రశయను డనురాగమునన్
కరములను మేను నిమురుచు
చిరునగవును యాననమున జిగురొత్త ననెన్.

చ. అమరులఁ బాఱఁదోలి భుజగాంతకు డెట్లమృతంబు దెచ్చెనో
విమతుల వాదులన్ గెలిచి విక్రమశీలత నీవు శుల్కమున్
స్వమతజనంబులున్ స్మరసి స్వాంతమునందు విచిత్రమొందగా
నమితప్రభావము న్నెరయ హస్తిని నెక్కుటు వచ్చితౌ భళీ.

చ. అని యిటు సారెసారెకును యబ్జదళాక్షుఁడు భట్టనాథునిన్
గని కొనియాడ నావుడెద కళ్వళమంది పునఃప్రణామముల్
వనరఁగ కేలుదమ్మి యిటు వయ్యన మోడ్చియు దేవదేవ మీ
తనయుడనైన దాసునిటు తద్దయుఁ బెద్దయు సేయనేటికిన్.

గీ. అనుచు నృపు డొసఁగిన యగ్రహారములను
గజము లొగి నూత్నసద్రత్న ఖచితకనక
భూషణాంబరముల దెచ్చి పూజసేసి
హరికి నర్పణ మిచ్చె ధన్యాత్ము డవని.

క. అది కని సర్వజనంబులు
ముదితాత్ములు నగుచుఁ బొగడు మురఘస్మరుడున్
మది సంతసించి యాఘను
సదయత వీక్షించి యనియె సౌహార్దముగాన్.

ఉ. ఇచ్చెద నీకభీష్టమగు నీప్సిత మెయ్యదొ యన్న నావుడున్
యిచ్చలొ పొంగి యిట్లనియె యిందిరవల్లభ నా మనంబున
న్నచ్చుగ మీ పదాబ్జములయందతిభక్తియెగాక యేమియున్
[illegible] వరము యిచ్చి కృతార్థునిఁజేయు సత్కృప.

చ. అన విని భూపిరాట్టి మది హర్షమునొందుచు యిమ్మహాత్మకున్
తనయనునై జనించుటకు తద్దయు కోర్కెఘటిల్లి భక్తచేఁ
ననుమతిగైకొనె న్నపుడు నాథునుడుండు నికేతనంబునన్
ఘనమగు దివ్యసంపదల గల్గి సుసౌఖ్యత నుల్లసిల్లగాన్.

క. పరిపూర్ణకృపను గొని యిటు
హరిచిత్తుని మందిరమున నతులితపదవుల్
విరివిగ తనుదా నంతట
పురుపసతి కృపయుఁ గల్గి నుద్భవమయ్యెన్.

క. ముంగిలి ముంచట సుండెడి
తంగేటను జున్నుఁ బొడము తద్విధముగనున్
హంగుగ సంపదవెల్లను
పొంగుచు తముఁబాము యింట పొలుపొందె నిటున్.

వ. ఇవ్విధంబున యాధన్వినామ పుటభేదనాధ్యక్షుండగు వటపత్రశయను
ననుగ్రహంబున భట్టనాథుని నిజనివేశంబు సకలసంపత్పరిపూర్ణంబై
విలసిల్ల నమ్మహామహుండు ననవరతభగవద్భాగవతాచార్యకైంకర్యా
సక్తనిష్ఠాగరిష్ఠుండై షోడశోపచారంబుల తదీయారాధనంబుఁ జేయుచు.

ఉ. అంతకుమున్నె పూర్వమున యన్నగరాధ్యులచే క్రయంబుకున్
స్వంతముగాగ గైకొనిన స్వాస్థ్యము సేద్యమొనర్చి యందులన్
వింతగునట్టి సుప్రసవవృక్షచయంబులు నాటి పెంచఁగా
స్వంతముగా నొనర్చె నిటు సర్వము నంచలు గాంచి మెచ్చఁగాన్.

గీ. అల వసంతునట్ల యలరుచుఁ బూదోట
పొలుపెలర్పఁగాను ప్రోదిఁజేసి
సకలసుమచయంబు సరులుగా నిర్మించి
హరి కొసంగుచుండె ననుదినంబు.

క. విరిదోటపనులఁ దమిచే
మరువక ద్వయమంత్ర మెపుడు మానసమందుꣳ
స్మరియించు చహరహంబులు
నిరతము వచియింపుచుండు నియతమెలర్పꣳ.

సీ. అంతట యొకనాడు నరుణోదయంబున
నిత్యకృత్యంబులు నియతమతితొ
స్నానసంధ్యాద్యనుష్ఠాన సద్ధర్మము
లతిసత్వరంబుగా నటులొనర్చి
కటియందు నీర్కావి పుటమును దిగఁజుట్టి
కరమున నుద్దాలకమును బూని
విరితోట కరుదెంచి యరసి యందున నుండు
కసపు కట్టియ రాయి కంటకముల

గీ. విసువ కటు వెదకివైచుచు విశదముగను
సరసముగ మిట్టుపల్లంబు సదనుపడఁగ
జేసి యటు కాలువలుదీర్చి చిత్రముగను
పాదులొనరించె బహువృక్ష పంక్తికపుడు.

సీ. మాధవి విరజాజి మల్లికాలతలకు
మొల్లంబుగా తొట్ట యల్లు లిడియు
కుందచందనములు గొజ్జంగితరులకు
పొందుగా నటమీద ప్రోదిఁజేసి
కరవీర గోరింట గన్నేరు చామంతి
ఘనసార ద్రుమముల కలుపుఁదీసి
పున్నాగ గేదంగి పొన్న వావిలి మల్లె
[illegible]

గీ. పారిజాత దమన పాటల క్రముకాది
ప్రసవ కుటజములను ప్రకటముగను
నెరసు, కసవు, ప్రోవుఁ దొరలకుండఁగఁజేసి
విష్ణుచిత్తమౌని వెరవుతోడ.

చ. పొలుపగు పుష్పవాటి కిటు పోషణసేయుచు భట్టనాథుడు
న్వెలయుచు వచ్చుచో నచట హృక్షత శ్రీతులసీవనంబునన్
వెలుగుముఁగాంచి డెందమున చిత్రమునొందుచు సాగి మ్రొక్కుచున్
మెలఁకువతోడ జొక్కి కడు మెల్లన దోకుదుపార గైకొనిన్.

ఉ. మున్నుగ గల్పుఁడీసి తరుమూలము దోటును త్రవ్వి నేర్పుగన్
తిన్నఁగ పాదు చేర్పరచ దివ్యచరంబగునట్టి తేజమున్
కన్నుల కద్భుతంబుగను కాంచననిర్మితమైన పేటిక
న్నున్న విధంబుఁ గాంచి తన యుల్లమునన్ గడు విస్మితుండునై.

చ. ఇదివర కెన్నఁడున్ గనని యిట్టి విచిత్రము దేమొకో యనిన్
మదిని దలంచుకొంచు యనుమానముఁ దీరఁగ మూతమెల్లఁగన్
విదళిచి గాంచ నందులను వొత్తిగిలుండెడి బాలికామణిన్
సదయత కేలరావిగిచి సమ్మదమందుచు నుండునయ్యెడన్.

ఉ. భాసురశీరయుక్తమయి భాసిలు నావడిమాసమందునన్
భాసుత శుక్లపక్షమున పుబ్బనె తార దివాధ్యమందునన్
మానవబాలికాకృతిగ మంచి శుభోదయ వేళలందునన్
సూనశరాభదేహమున సోయగమున్ దళుకొత్త నింపుగన్.

వ. ఇవ్విధంబున యద్ధరాకన్యకాలలామంబు విష్ణుచిత్తోద్యాన ప్రసూన కాంతార మధ్యప్రదేశంబునన్ వెలయు శ్రీతులసీతరుమూలంబున యావిర్భవించిన.

ఉ. బాలిక పుట్టినట్టిక్రమ భావమునందున దెల్యజాలకన్
జాల విచారముంబొడమ సంశయమందిన తీర్చజాలకన్
జాలిగనుండు నాథను విచారముదీ పశరీరవాణి దా
మూలముఁదెల్పఁగా దలచి మోదము నుప్పతిలంగ నిట్లనెన్.

మ. శరజాతోద్భవపంశ వెల్వెద మదిన్ జాలేల యీబాలయున్
ధరణీదేవత నీదు భాగ్యమహిమన్ దా వచ్చి నీపెంపు వా
విరితోటన్ దులసీవనంబున గడున్ విఖ్యాతసంజాతయై
హరికిన్ నవ్యప్రసూనమాలికలు దా నర్పింపఁగా గోరెటున్.

చ. మును మిథిలావనీశుఁ డతిమోదతఁ జేసెడు యజ్ఞవాటికన్
జననముయైన ధాత్రిసుత చాడ్పున నిన్నుఁ గృతార్థుఁజేయఁగా
వనజదళాక్షు నాజ్ఞ నిటు వచ్చియు భూమి పిరాట్టి నియ్యెడన్
జననమునయ్యె గావునను సంశయముందక సాదుకొమ్మనన్.

చ. అని యిటు యద్ధరామణి యాంతరసంగతులెల్ల మర్మమున్
వినయశరీరి బల్కఁగను విస్మితుడౌచును భట్టనాథుడున్
తనయను నంసభాగమున తానటుఁ జేర్చి ప్రియం బెలర్పఁగా
చనియె నిజాలయంబునకు చక్కఁగ శాటి ముసుంగువేసుకోన్.

గీ. అరిగి తనదేవి యమ్మాణి యనెడునట్టి
కాంత కొసఁగిన యత్యంతకౌతుకమున
వేగఁ గైకొన నంత నా విష్ణుచిత్తు
కలికి తన కబ్బినట్టి యాక్రమముఁ దెలిపె.

చ. విని ముదమంది యామగువ వేగమె గైకొని బాల నక్కున
న్ననుపుగజేర్చుకన్ దనదు యాప్త సుహృజ్జన బంధుకోటినిన్
కనుఁగొని యిద్విధంబు కడు గౌరతగా వినుపింప వారలున్
మనమున నుత్సహించి యతిమక్కువ నెక్కొన బాల కప్పుడున్.

ఉ. సంపెఁగతైలముం దలను చక్కఁగ నంటి శితాభ్రపంకమున్
సొంపుగ మేనియం దలఁది సొల్పెదఁదీరఁగ మజ్జనంబునున్
యింపుఘటింపఁజేసి పసియెల్లనుదీర దుకూలశాటికన్
పెంపుగనొత్తి చక్కఁగను ప్రేమతొ బంగరు తొట్లెయందులన్.

చ. మెలుకువతోడుత న్నునిచి మేలిమి సన్నపువల్వ గప్పెటున్
మలయజపుప్పొడుల్ యగరు మై బ్రసరించఁగ ధూపము న్నిడిన్
యలసతఁదీర పాటలను హాస్యతఁ బాడుచు బాలికామణిన్
లలనలు నిద్రఁబుచ్చిరటు లాలనసేయుచు మోదితాత్మలై.

క. నెమ్మది యమ్మాణ్యమ్మను
యమ్మగువలు యల్లఁగూడి యనురాగమునన్
యిమ్ముగ నొక గేహంబున
సమ్మదమున నిల్పి రధికసమ్మద మొదవన్.

క. దశవాసరంబు లీక్రియ
విశదంబున గడపి యంత వేడ్కఁదలిర్పన్
శశిముఖులును పురుడోమిరి
నిశితాత్మలు నగుచు వేడ్క నేర్పుఘటిల్లన్.

సీ. అంత శ్రీహరిచిత్తు డార్యానుమతమున
యతిపతో సుస్నాతు డయ్యువేగ
విధ్యుక్తముగ నిత్యవిధులు యథావిధి
గావించి యత్యంతకౌతుకముగ
ధరణీ నిజాంశయౌ తనయకు కడుపేర
విబుధజాలములెల్ల వినుతిసేయ
మోదంబుతోడుత గోదాపిరాట్టనే
నామకరణమున నమ్రతగను

గీ. సకలవిధబంధుకోటికి సుకరముగను
షడ్రసోపేతభోజ్యంబు సత్వరముగ
వినయమొదవంగ గావించి వేడ్కతోడ
యుచితమగునట్టి కట్నముల్ యొసఁగెనపుడు.

వ. ఇవ్విధంబున మహీసురాగ్రగణ్యుండగు భట్టనాథుండు పుత్రికావివాహ మహోత్సవంబు నత్యంతవైభవాతిశయంబుగా తన్నగరస్థితాశేష చేతనవ్రాతంబుల కనుపమిత మృష్టాన్నపానంబుల పరితృప్తులంచేసి బహూకరించుట తద్వృత్తాంతంబు పాండ్య మహీవల్లభుండు పథికులచే విని పరమానందభరితుండై హితసమూహంబులతోడన్ వెడలి శ్రీవల్లిపుత్తూరున కరుదెంచి యమ్మహామహానికేతంబుననుండు గోదావిరాట్టిని సేవించి తదనుకూలానుకూలంబగు కనకమణీఖచితాభరణంబులు సమర్పించి యత్యంతాతిశయంబున యుండు నయ్యవసరంబున.

సీ. అఖిలచేతనతతికి యాధారమగునట్టి
యవనికాంతయు చిన్న యబలయయ్యె
జనని పొదిగిటిఁగొదిగి మనుజబాలికయయ్యె
స్తన్యపానంబునుఁ జక్కఁగాను
పూనిసేయుచు బాల పూటపూటకుఁ జూడ
నభివృద్ధియగుచును యఖిలజనుల
తలయెత్తి మెల్లగా తగ విలోకింపుచు
నవ్వ యత్తనె మాట లనఁగ నేర్చె
గీ. కరము లంఘ్రులు భువియందు కైగఁబూని
యలరి నిట్టట్టుఁ దిరుగుచు చెలులఁగూడి
దోగియాడుచు గూర్చుండి తొట్రుపడగ
కల్కి ముద్దులు వగఁగుల్కఁ బల్కె నెపుడు.

ప. మఱియును.

సీ. కోమలి తనుదాసె కుడ్యముల్ కైఁబూని
యిల తప్పటడుగులు నిడగ నేర్చె
కొంకెదఁదీరియు కోల కేలనుబూని
దుడదుడ నందంచ నడువ నేర్చె
కుంతలజాలముల్ వింతగా చూగాడ
పెడపెడ గంతులువేయ నేర్చె
జనని జనకుడు పేర్మి తను జేరఁబిల్చిన
మేతెంచి ముద్దులు యిడగ నేర్చె
గీ. అలరు పుష్పాలబంతుల నాడనేర్చె
కరము లల్లార్చి ముచ్చటల్ గరపనేర్చె
చిలుకగములకు పద్యముల్ జెప్పనేర్చె
కలికిరాయంచతతి కాటసలుప నేర్చె.

చ. తరుచగు నూత్నసస్మణులు దాపిన బంగరు తూగుటుయ్యలన్
పరిష్కృదితంబుదూ విపుల పాన్పున దాలికనుంచి నొయ్యనన్
సరసమృదూక్తియన్యముల చాసలు యూచుచు జోలఁబాడగన్
విరసతనొంది గోచ విన వ్యంగ్యతనొందుచు కంటగింపఁగన్.

చ. నళినదళాక్షి లీలలును నమ్రతగా వచియింపఁగా వినున్
కలకలనవ్వి గోదయును కన్గవమోడ్చి సుషుప్తినొందు తా
నలరుచు నిత్తెరంగున నహర్నిశియందుల బాలలీలలన్
నిలయముయందుల న్నిలిచి నెచ్చెలులన్ గుమిఁగూడి యాడెదున్.

క. తననీడ ఘటజలంబులఁ
గనుఁగొని యాటాడఁ బిలుచు కడునెయ్యమునన్
పనిఁబడి యిట్టటుఁ దిరుగుచు
తననీడనె తా యదల్పు తగ రాకనుచున్.

గీ. తల్లి పైటచెరుగు తా ముసుంగిడుకొని
వదిగి బూచి యదుగొ వచ్చెననుచు
తనదు హర్మ్యసఖుల తరుణుల జడిపించు
బయలువెడలి తానె భయముమాను.

ఉ. తల్లియు బుజ్జగించి ప్రమదంబున నెత్తుక ముద్దులాడుచున్
మెల్లన భోజ్యముల్ యిడఁగ మింట వెలింగెడు చందురున్ గని
న్నుల్లమునందు ముచ్చటను నొయ్యన పొత్తుకు జాబ రమ్మనిన్
పల్లవపాణి పిల్చు కడు ప్రాముకనొందుచు బాల్యవేళలన్.

చ. అనుదిన మిత్తెఱంగునను యప్పకయాకృతి ఘూపిరాట్టి దా
కనుగొనువారికి న్నిగుల కన్నులపండువుగా మెలంగుచున్
తన తలిదండ్రికిన్ ప్రియము తద్దయుపేర్మిటు నివ్వటిల్లఁగా
ఘనతగ బాలక్రీడ లిటు కౌతుక ముప్పతిలంగ జేయుచున్.

వ. ఇట్లఖిలజనాహ్లాదకరింబుగా వసుంధరావధూతిలకంబు గోదాభిధానం
బునన్ దినదినప్రవర్ధమానయై తేజరిల్లుచు.

సీ. రత్నమౌక్తికముల రావిరేకిట్టట్టు
నిటలభాగంబున నటనసల్ప
కుటిలకుంతలములు గుమిగూడి యందంద
చెక్కుటద్దంబులఁ జిందులాడ
నవరత్నములచేత నవకమై చెన్నొందు
చిల్కతా ళురమున చెంగలింప
ఇంద్రనీలపుబొద్దు లింపుగా కరముల
నిగనిగత్కాంతులు నిండుకొనఁగ

గీ. గజ్జెలందెలు వాకీలు కైగఁబెనఁగి
చరణయుగ్మంబునందులఁ సందడింప
పొత్తుకత్తెలతోఁ గూడి పొలుపు పెలర్ప
పాటలాధరి యేప్రొద్దు నాటలాడు.

ఉ. ముద్దులుగుల్కు పల్కులను మోవి మృదుత్వము చెక్కుటద్దముల్
కద్దనొ లేదొ యానవెడి గొనును చేరలకెమ్పు కన్నులున్
దిద్దినయట్లు కన్బొమలు దివ్యతరంబగు బాహు లూరువుల్
ప్రొద్దొక వింతవింతగను పొల్పువహించెను యింతి కప్పుడున్.

సీ. సఖురాండ్రతోగూడి సౌధాంతరంబుల
బొమ్మరిండ్లు నమర్చి పొలుపెలర్పి
హరికి పైదర్పికి పరిణయంబును మన
మనురక్తి గావింతమనుచు వేగ
స్త్రీపురుషాకృతిఁ జెన్నొందు బొమ్మల
యనురక్తితోఁ దెచ్చి యచట నిలిపి
కూర్మితోడుత పెండ్లికొడుకువారలు మీరు
తాను పెండిలికూతుదాన ననుచు
గీ. సకలసన్నాహములతోడ సత్వరముగ
యెదురుకొనివచ్చి యత్యంతముద మెలర్ప
మల్లెమొగ్గలు తలబ్రాలు మరియుఁబోసి
స్థాలిపాకాది విధులను తగ నొనర్చి.

చ. వినయత పెండ్లివారికిని విందులు తాను భుజింపఁజేయగన్
పనిఁబడి తా స్వహస్తమున బాగుగ గుజ్జెనగూళ్లు వండెడు
న్ననువగు భోజ్యము న్నిడియె హర్షత వారలు నుత్సహింపుచున్
తనుఁ గొనియాడ గోదసతి తల్లియు దండ్రియు గాంచి నవ్వఁగాన్.

సీ. అంత యొక్కొకనాడు ననుఁగు చేడెలఁ గూడి
వింతగా పువ్వుల బంతు లాడు
అలరుచు నొకనాడు యచ్చనగిల్లలు
కుప్పీలు వామనగుంట లాడు
తాగెల్చి వారల ధవునిపే రడిగియు
పరిహాస మొనరించు భాసురముగ
నొకవేళ తానోడి వారలె గెల్చిన
తనభర్త యిందిరాధవుడె యనుచు
గీ. తడయ కీరీతి మదిలోన బిడియమెడలి
పలికి పలికించు వారిచే ప్రౌఢిమలర
ననుదినంబును యీరీతి నాటలాడు
భామినీమణి తన తోడిబాలికలరొ.

గీ. పచ్చరంగులు తనమేన ప్రతిఫలింప
కుంచికుచ్చుల కుళ్లాయి కంచుకంబు
పచ్చవిలుకానిజనని యప్పగిది దాల్చి
యంచగతులను నటియించు హర్మ్యములను.

చ. తరుణులఁ గూడి వింతగను దాగిలిమూతలటంచు యాడుచున్
గరిమతో సప్తతాళములు కాలప్రమాణము దప్పకుండఁగన్
కరములు చప్పటు ల్లిడుచు గౌనసియాడఁగ నృత్యమాడుచున్
నిరతము విష్ణుచిత్తుసుత నెయ్యము రంజిల యాడుచు న్వెసన్.

మ. చెరుకుం గోలలు సుప్రసూనపుసరుల్ చెన్నొందు వీణల్ వెసన్
కరయుగ్మంబులఁ బూని మీటుచు హొయల్ గాసిల్లి వేసారకన్
హరి నారాయణ కృష్ణ రామ యనుచున్ న్నానందతస్వాంతతన్
హరిచిత్తాత్మజ బాలికామణులతో హర్మ్యాగ్రమం దుంచిటున్.

వ. ఇవ్విధంబున యఖిల జనాహ్లాదకరంబుగా అవనీవధూలలామంబు హరిచిత్తాకృతియై యత్యంత ప్రమోదంబున అనుదిన ప్రవర్ధమానయై యుండెనని లక్ష్మణాహ్వయదేశికుం డఖిల తదీయనివహంబులతో సాకల్యంబుగా యానతిచ్చి, యవ్వలి కథాశ్రవణ కుతూహలాసక్తచిత్తులై యడుఁగుటయు,

చ. ఖగకులరాట్తురంగ నర ఖాదనశౌర్య విభంగసంగరా!
దృగణిత మానుషాంగ ధృత హస్తరథాంగ పతంగమోక్షణా!
నిగమ విపక్షభంగ రమ నీరజ మానస భృంగరూపకా!
సుగుణ హృదంతరంగ బల సూదన సూదన శీర్షఖండనా!

కం. నాగాంతక సరవేషా!
నాగాంతక స్కంధరోహ నరరథరక్షా!
నాగాంతక శిరవిదళన
నాగాంతక వైరి హనన నాగసుతల్పా!

సుగంధీవృత్తము :
సుమనస స్తోత్రా! సుందరగాత్రా!
కమల కళత్రా! కంజ సునేత్రా!
శమదమ వేషా! సామజపోషా!
విమత విదారా! వీరవిహారా!!

గ. ఇతి శ్రీమద్వేంకట లక్ష్మీనృశింహ వరప్రసాదలబ్ధ గీర్వాణాంధ్రోభయ భాషాకవితా "విచిత్ర విదేహరాజకన్యకాభ్యుద"యాది షోడశమహా గ్రంథ బంధురాలంకార నిర్మాణపారీణ ఘనయశోబంధుర మౌద్గల్య మహాఋషి గోత్ర పవిత్ర వేంకటదేశికపౌత్ర కుమారవేంకటాచార్య పుత్ర మరింగంటి వేంకటనృశింహాచార్య విరచితంబైన గోదావధూటీ పరిణయంబను శృంగార ప్రబంధంబునందు ప్రథమాశ్వాసము భాసిల్లును.

ఓం

# శ్రీ గోదావధూటీ పరిణయము

## ద్వితీయాశ్వాసము

కం, శ్రీదయితాంకిత వక్షా !
వేదమయాకార విబుధ విదితస్తుత్యా
మోదిత ఫణినగ విహరణ
ఆదిమ సురభయదకోప హరిన్నరరూపా.

గీ. చిత్తగింపుము యతిరాజ శేఖరుండు
యఖిల చేతన తతులకు నతిశయముగ
వసుపతీ సతియగు గోద వైభవంబు
స్వాంతమలరంగ వినుపించె సమ్మదమున.

సీ. శ్రీధరామానిని శేముషిగల కోర్కె
నొనగూర్ప కాంతార వల్లభుండు
నగు వసంతుడు వాల నసురాగలీలను
పాదపాంగన దివ్యభావ మలర
యవలంబనముసేయు యతను క్రీడలఁ దేల్ప
తరుగర్భచయములు దాల్చి మెల్ల
మలయానిలంబనే మంత్రసూతికి వల
నలరి సుప్రసువంబు లైన మాడ్కి

గీ. అగణితంబైన శాఖల నల్లు లతల
సందుసందుల నత్యంత సౌరభముగ
చిగురుజొంపంబు మొగ్గలు చిత్రమైన
లతలు ఫలములు గుచ్ఛముల్ చతురతగను.

గీ. అతులితంబగు నా వసంతాగమమున
వరపుదీపింప కాంతార వాటికలను
యమితఫలపుష్పనిచయముల్ యతిశయముగ
వింతవింతగ యావిర్భవించఁ దొణఁగె.

కం. శుక పిక శారిక షట్పద
నికరంబులు కేళివనులె నిలయముగాగన్
ప్రకటముగ నిలిచి తేనెలు
సుకరంబుగ గ్రోలి సౌఖ్య సుఖములతోడన్.

మ. హరిచిత్తాత్మజ కోర్కెఁదీర్ప తరులున్ హర్షించి యాయామినిన్
కరవీరంబులు జాజి పొన్నపొగడల్ గన్నేరు చామంతులున్
విరజాజుల్ ఘనసార చంపకములున్ వింతౌ ప్రసూనావళుల్
మరియున్ మల్లెలు మొల్లలున్ దమనముల్ మందారసందోహముల్.

వ. అంత వసంతోదయాంకురితంబులై వనంబులున్ జెలంగె నయ్యెడ.

ఉ. అంతట యొక్కనాడు తన యాప్తసఖీజనసంయుతంబుగా
అంతిపురంబు వెల్వడియు హాటకసన్మణిభూషణద్యుతుల్
వింతగ మేనున న్మెరయ వేడ్కఁదలిర్పఁగ యంచయానతన్
సంతసమందుచున్ జనకు సన్నిధికిం జనె గోదదేవియున్.

చ. అరిగి ప్రసూననోకహము లారసి యిచ్చలొ నుత్సహింపుచున్.
హరినిభమధ్య చక్కఁగను యంతటయు న్విహరించి మేలిమౌ
విరులు గుళుచ్ఛముల్వెదకి వేడ్కతొ చేడె లొసంగఁ గైకొనిన్
తిరిగి నిజాలయంబునకు తీవ్రతఁగా నరుదెంచు నిచ్చలున్.

చ. కుతుకమురంజిలన్ యిటుగ గోద వధూటియు ప్రత్యహంబునున్
యతులితగంధవద్వనములందు విహారముసేయుచు న్వెసన్
మతిహితమైనయట్టి సుమమంజరులున్ గొనివచ్చి తంత్రికిన్
యతివినయంబున న్నొసఁగ హర్షత నాఘను డవ్విగైకొనిన్.

చ. నిపుణతతోడ మాలికలు నేర్పుఘటిల్లఁగఁ జేర్చి చక్కఁగా
తపనునిరశ్మి యేమియును దాఁకనకుండు నికుంజమందున
న్నపరిమితంబుగన్ చిగురు టాకులునున్ పయిఁగప్పి మెల్లగా
నుపమతొ శీతలోదకము నొయ్యన పైపయి జిల్కరింపుచున్,

చ. సుమతరుపాదులన్ కలుపు శోధనఁజే సటు నీటికాలువల్
సమముగఁజేసి తోయములు చక్కఁగఁ గట్టుచునుండు నత్తరిన్
యమితపు మోదహృద్యయయి హర్షత గోదటు పుష్పమాలికన్
క్రమమున మెల్లఁగా దిగిచి కైశిఖియందు నలంకరించుకన్.

చ. ఘటమున నున్ననీట తన కాయపు కాంతిని సోయగంబునున్
స్ఫుటమునఁగాంచి డెందమున సొంపుదలిర్పుట కిచ్చమేచ్చిటున్
తటుకున యప్పటట్లగను తాల్మితొ నుంజిగురాకు నల్లినన్
పుటికలొ జేర్చి తిన్నగను పుష్పసరుల్ యిటు చౌర్యవృత్తిచేన్.

చ. అనుదిన మిత్తెరంగునను యన్యుల కేరికిఁ దెల్యకుండఁగన్
వనరుహపత్రనేత్రి తన వాంఛయుఁ దీరఁగ పుష్పమాలికల్
తన శిఖ కంధరంబునను దాల్చుక నిచ్చెడునట్టి సంగతుల్
మనమునఁ దెల్య కా ఘనుడు మక్కువ శౌరికొసంగగైకొనిన్.

చ. తన తనువందు సొంపుగను దాల్చక సంతసమందుచుండఁగన్
యనఘుడు విష్ణుచిత్తుఁ డెద హర్షము నొందుచు ప్రత్యహంబునున్
దనరగ గోదదేవి మును దాల్చినయట్టి ప్రసూన మాలికల్
వినయముతో నొసంగి కడు వేడ్కఁ దొను స్వటపత్రశాయికిన్.

గీ. అర్పితంబుసేయ నమ్మహామహుఁ డవి
స్వాంతమందు యెగ్గుశాయ కఱుత
సిరియుఁ దాను దాల్చె శేముషియలరంగ
భట్టనాథు దరసి బ్రస్తుతింప.

వ. ఇట్లు కొన్ని వాసరంబులుఁ జరుగు ననంతరంబ యం దొక్క నాడు,

చ. అలరుచు భట్టనాథగురు డబ్జవిలోచనయైన పట్టితో
నలరుల తోటకు న్నరిగి యందున తానొనరించెడున్ పనుల్
పొలుపుగఁ జక్కఁజేసియును పూపొదరింటిలొ మున్నుఁ దాచినన్
యలరుల మాలికల్ గొనియు యాత్మనివేశము కేగువాడయిన్.

ఉ. వచ్చెడిఁ జాడఁ దెల్యకను వారిజనేత్రియు యెప్పటట్లగన్
చెచ్చెర పుష్పమాలికలు చేకొని కైశికియందు నింపుగ
న్నిచ్చకువచ్చినట్లు ధరియించుక నీటిలొ నీడఁజూడఁగా
నచ్చెరువంది యా యనఘుఁ డారసి మెల్లనఁ బుత్రితో ననెన్.

ఉ. అమ్మరొ స్వామి కర్పితము లయ్యెడు మాలికలేల నీ క్రియ
న్నిమ్ముగ నీవు గైకొనుట యింతపచారముయౌ ఔరుంగకన్
ధర్మముఁ దప్పి యిత్తెరుఁగు దాల్చుట నీ కిది కూడదంచుఁ దా
క్రమ్మర బాలకై కొసఁగి గ్రక్కున నూత్న ప్రసూనమాలికల్.

చ. తటమటసేయక న్విరుల దండలు మున్పటికన్న మిక్కిలి న్
స్ఫుటముగఁ గూర్చి తూర్ణతను సొంపు ఘటిల్లఁగ భట్టనాథుడు న్
పటదళశాయి సన్నిధికి వచ్చి సమర్పణసేయ నావుడు న్
కటకట నొంటి యవ్వి కడగంటనుఁ జూడక కైస్పృశింపక న్.

ఉ. మారుమొగంబుఁ జేసుకొని మౌనతగా నటులుండు భావము న్
సూరివరేణ్యుడు న్యరసి సొక్కుచును న్ధరసాగి మ్రొక్కి మా
నేరము చిత్తగించి కృప నెమ్మది మమ్ములఁ బ్రోపకున్నను న్
వారిజనాభ యింకెవరు వారణసేయ సమర్థు లిబ్బువి న్.

చ. అని వినయానురాగమున హస్తయుగంబును మోడ్చి వేడఁగ న్
మనమున కిన్కఁబోవిడిచి మౌనివరేణ్యునిఁ గాంచి నవ్వుచు న్
ఘనద గభీర భాషణల కల్మిడిగా కరుణార్ద్రహృద్యుఁడై
యనఘ మదీప్సితంబు నిసుమంతయుఁ దెల్పెద నేడు నీతోను న్.

చ. మృదమృదయాల ! నీ దుహిత మున్ను శిఖ న్ధరియించు మాలికల్
మదికిని యిష్టమై నెగడు మళ్లియు నీవివి గొంచుపోయి యా
సుదతియు దాల్చిన న్సరులు జుంగక గైకొనిరమ్ము పొమ్మని న్
సదయత నానతివ్వఁగను చక్కఁగ నాయనఘుండు యట్లగ న్,

చ. సదనము కేగి యత్తెరఁగు సాధ్వితొ పుత్రికతోఁడఁ దెల్పదా
మదిముదమంది యిర్వురను మౌనివరేణ్యుఁడు వెంటఁబెట్టుక న్
కొదలకలేకను న్చనియు గొబ్బున శ్రీధరుచెంత నిల్చెటు న్
విదితముఁగాగ మెల్లగను విన్నపము న్సొనరింపగా విని న్.

చ. అలరుచు వారల న్గనియు నజ్జదళాక్షుఁడుఁ గారవించియా
యలికులవేణి పెన్నెరుల యందుల నుండెటి పుష్పమాలికల్
మెలకువతోడఁ గైకొనియు మెల్లఁగ కంధరమందు వేడ్కతో
పొలుపుగను న్ధరించి యనె భూరికృపారస ముప్పతిల్లఁగ న్.

చ. అనిశము మీర లిప్పగిది యర్పణసేయుమటన్న వారలున్
వినయత మ్రొక్కి వేగ తమ వేశ్మము కేగిటు ప్రత్యహంబునన్
తనకక తెచ్చియు న్నొసఁగ తామరసాక్షుఁడు యిచ్చమెచ్చుచున్
ఘనతకగఁ వేగ కైకొనియు కౌతుకమందుచునుండు నంతటన్.

ఉ. గోదవధూటి యుత్తెరఁగు కొప్పనఁ దాల్చిన పుష్పమంజరుల్
మోదముతోడ శౌరి తన మూర్ధమునన్ యురమందు చక్కఁగాఁ
యాదరమొప్ప ప్రత్యహము హర్షముఁ దోకొన నౌధరించు యా
సోద నెరుంగజాలకను జుస్గుచునుందురు యెల్ల భూజనుల్.

వ. ఇట్లఖిల జగజ్జన నయనానందకరంబుగా శ్రీ విష్ణుచిత్తాత్మజయగు గోదావధూలలామంబు ప్రాగ్జన్మ ప్రభావ భవాతిరేకంబున ప్రకృతభావం బుజ్జగించి షడ్వర్షప్రాయంబునందె పరేంగిత దివ్యజ్ఞానంబున జనకు సన్నిధానంబునకు డాయంజని వినయ వినమితోత్తమాంగియై సేవించి, యమ్మహామహు సమ్ముఖంబున న్నిలిచి యతనికి పహాయంబుగా శ్రీ తులసీదళ నవ్యసూనమాలికా నిర్మాణంబు సేయుచు ప్రస్తావోచితంబుగా యిద్ధరాతలంబునం గల భగవత్సన్నివేశ ప్రభావాకర్ణనాసక్తచిత్త యగుచు నత్యంత మృదు మధుర భాషణంబుల మెల్లన యిట్లనియె.

శా. అయ్యా! మిమ్మొక టేను వేఁడగ మదిన్ హర్షంబు నయ్యున్నదిన్
మియ్యాన న్నిదియే వినంగవలయున్ మీ కన్న మాకాప్తులున్
న్నయ్యా యెయ్యెడలేరు జూడఁ భువి నాయాత్మందు భావింపఁగ
న్నయ్యేదేమని మీరలంటిరె వినుం డామాటయున్ దెల్పెదన్.

ఉ. ఈ యుగమందు నీ జగతి యెందుల శ్రీశు నివేశసద్మముల్
ఎయ్యెడనుండు నవ్వి యవి యెన్నఁగ నెన్నియొ మీర లిప్పుడున్
నెయ్యు మెలర్పఁ దెల్పఁదలె నే విన వాంఛ ఘటిల్లెనంచునున్
సయ్యన సారెసారెకును సంతసమందుచువేఁడ నావుడున్.

చ. విని ముదమంది డెందమున విస్మయమందుచు ముద్దుపట్టియు
న్ననియెడి వాక్యసంగతుల కచ్చెరుపందుమ నమ్మ నీవిటుల్
మనమున యింతభ్రాంతిపడి మమ్మిటు వేడఁగ దాచనేటికిన్
వినుము సవిస్తరంబుగను వీనుల కింపుఘటింప చక్కఁగాన్.

చ. అని వినయానురాగమున నాత్మజసుంగని గారవించినీ
కనుగొని విన్నయట్టి ముచుఘస్మరు డుండెడి దివ్యదేశముల్
వినుము సవిస్తరంబుగను విశ్వమునంగల పుణ్యవాహినీ
వనగిరి పట్టణంబులను వైభవమున్ చెలువంద నెప్పుడున్.

చ. హరికి విహారలీలలకు నర్హములైన నదీనదంబులన్
సురలును మౌనులున్ నృపులు సొంపుదలిర్పగ దివ్యగేహముల్
విరివిగ మున్ను యిద్ధరణి వేడ్కఁదలిర్ప ఘటించు వాటిలో
నరసి శతారియాదియగు నార్యులు మున్ వివరించినట్టివిన్.

క. అష్టోత్తరశతసంఖ్యను
స్పష్టముగా నిర్ణయించి స్వాంతములందు
న్నిష్టానురక్తిఁగాగను
శ్రేష్ఠంబై యుండు నవియు జెప్పెద వినుమా!

సీ. ముద్దియ వినవమ్మ మునుపు మీపెద్దయ్య
లత్యానురక్తితో నభినుతించు
దివ్యతిరుపతులుండు దేశంబు లిబ్బువి
మహనీయ తుండీర మండలమున
నలుబదిమూడును నటుమీద చోళోర్వి
మండ లిర్వదినాల్గు యుండు నచట
పాండ్యమండలియందు పదునెనిమిదటమీద
మళయాళ కేరళ మండలముల

గీ. నరయ ద్వాదశసంఖ్యయై యలరుచుండు
యుత్తరోర్విని పదకొండు హత్తియుండు
నరయఁగా నూటయెనమిది యనెడు సంఖ్య
బరగుచుండెడు యవి విను పద్మనయన!

వ. ఇమ్మహాదివ్య స్థళనామంబులఁ వేరువేర సాకల్యంబుగా వినిపించెద సావధానంబుగా నాకర్ణింపుమని యిట్లనియె.

సీ. శ్రీహస్తిగిరి వృషశైలంబు వానాద్రి
పరదివ్య మాహేంద్ర వరపురంబు
శ్రీముష్ణపురమును శ్రీపెరుంబూదూరు
తిరుక్కోవళూరును తిరుపుళింద
తిరుకణ్ణపురమును తిరుక్కారివాసంబు
తిరుమంగళంబును తిరువళూరు
తిరుపత్తిళూరును తిరుదేవరావును,
తిరుపారకంబును తిరువళంద

గీ. మరియు తిరువూరు తిరుకారకము పుళింద
తిరువలిక్కేళి నాంగూరు తిరువరంగ
పురము తిరువారకంబును భూతపురియు
మణిపురంబును మల్లేల మంగపురము.

సీ. పరమేశ విణ్ణగరు పార్థన వెల్లియు
కావలంపాడును కండనూరు
తిరుతత్తి యంబాల తిరుమణి మండల
అథమయ వైకుంఠ మను ఘనగిరి

తిరువూరు తిరుత్తణ తిరుతోళపురమును
తిరుకారకన్నియు తిరువళూరు
అష్టభుజకరపురము నళఘరి పురుషోత్త
పురము వెళ్కాపురి పుండరీక
గీ. మరయ తుండీరమండలియందు మున్ను
శఠజిదార్యాది దేశికుల్ సన్నుతించు
మండలత్రయతిరుపతు లుండు నింక
చోళమండలి గలయవి సుదతి వినుము.

సీ. శ్రీరంగ మొరయూరు చెరిపొరియూరును
అంబవిణ్ణగరంబు యాదనూరు
తిరుకణ్ణపురమును తిరువళందూరును
కణ్ణాపురంబును కణ్ణమంగ
తంబివిణ్ణగరును తంజాపురంబును
మొరయూరు మదిరెయు మోగపురము
చిరునగర్ తిరువెళ్ళ చిత్రకూటంబును
నందాపురంబును యెందులూరు
గీ. కందనూలు కణంగుడి కారుకన్నె
తిరుమణంగుడి కరుగుడి తిరువెళంద
యనెడు యిరువదినాల్గు నీ యవని యందు
గలవు యట పాండ్యమండలి గలవి వినుము.

సీ. తిరుమాలిరంబోలె తిరుకొట్టియూరును
తిరునఘరు మోఘూర తిరవరంగ
తిరుకోవళూరును శ్రీవిల్లిభుత్తూరు
తిరుపుళింగుడియును తిరువళిప్ప

మయతిరుయలమంగ తిరుదర్భళయనంబు,
మహిసారపురమును మాకుళింద
తిరుకురుహూరును శిరివరమంగయు
తిరమైన వైకుంఠపురము కుంతి
గీ. పురపరం బను యాఖ్య యీ పుడమియందు
పదియు నెనిమిది యీరీతి విదితముగను
పాండ్యమండలి యందుల బరగుచుండు
మరియు కేరళ మళయాళ మండలముల.

సీ. తిరువనంత పురంబు తిరుకారు కరయును
తిరువళి పురమును తిరువరారు
తిరుపుళియూరును తిరుకోళపురమును
తిరుకడిత్తానయు తిరువళూరు
వరుస పణ్వాండూరు యరయ చంగణ్ణూరు
వనదళిపురి తిరువనఘనాయి
మళయాళ కేరళ మండలద్వయమున
పదిరెండు తిరుపతుల్ ప్రబలముగను
గీ. యుండు వినవమ్మ పదకొండు యుత్తరమున
యిందిరాధవు కేళికా మందిరముల
దనరు దివ్యప్రభావంబు తరమె యన్న
నాదు మది దోచినంతయు నబల వినుమి.

చ. వినుము యహోబలంబు కడు వింతగు శ్రీ యదుశైలరాజముఁ
ఘనతగు నైమిశావనము గౌరతయౌ ముదితాచలంబునుఁ
వనరు యయోధ్య యా బదరి వారణ పట్టణ సాలగ్రామముఁ
దనరెడు ద్వారకా మధుర దాపగు రేబలె యాదిగాభువిఁ.

వ. ఇవ్విధంబున చతురార్ణవ మధ్యస్థిత మహీమండలంబునఁ గల అష్టోత్తరశత మహా దివ్యస్థళంబులుం గాక భగవద్వినోద విహారంబులగు స్వయంవ్యక్తస్థలంబు లనేకంబులుం గల వన్నిటికన్న శతగుణాధిక్యం బగు పరమవ్యోమతత్తుల్యంబగు శ్రీరంగనామ పుటభేదనంబున నుండు పరవాసుదేవుండే శ్రీరంగాహ్వయుండై యుభయకావేరీ మధ్యంబున చంద్ర పుష్కరిణీశైవలినీతటంబున అనంతార్కకోటి ప్రభాసమానుండై వేంచేసియున్నవాడని విష్ణుచిత్తుం డనురాగాతిశయంబున యానతిచ్చిన విస్మితాశ్చర్యాతిశయ మానసయై యగ్గోదావధూలలామంబు విని యమ్మ హామహా సౌందర్య సౌకుమార్య విలాసంబులకు సొక్కి నిశ్చేష్టయై పరమ యోగీంద్రునుం బలె స్వాంతంబున నానందంబు నొందుచు పులకిత గాత్రయై ఆనందాశ్రుపూరంబులు కనుదమ్ముల న్నొరయ నెట్టకేలకు ధైర్యావలంబనయై యమ్మహామహా విభవాతిశయంబున కుప్పొంగుచు జనకుని యాననం బాలోకించి; అయ్యా ! నిఖిలాంతర్యామియగు శ్రీమ న్నారాయణుం డీ మర్త్యంబున అర్చావతారస్వరూపుండై భాసిల్లు గతం బెయ్యది యత్తెరంగు సవిస్తరంబుగా వినవేడుకయ్యెడు నని పుత్రికా లలామంబు అత్యాసక్తిఁ వేడిన భట్టనాథుం డపరిమితానంద భరితుండై యమ్మానినీమణి వదనారవిందం బవలోకించి యేతద్భావితార్థంబు సాక ల్యంబుగా తెలిసి స్మితాననుండగుచు మెల్లన నిట్లనియె.

గీ. అమ్మ వినవమ్మ కల్పాదియందు మున్ను
తమ్మిచూలియు యిందిరా ధవునిఁ గూర్చి
నెమ్మనంబున యత్యంత నియతితోడ
తాముదంబున వెయ్యేండ్లు తపముసేయ.

ఉ. ఇందిరవల్లభుండు యరవింద సుమోద్భవు భక్తి చేష్టకుఁ
డెందమునందు సంతసిలి డిండిమమాదిగ దివ్యవాద్యముల్

దంధణయంచు మ్రోయఁగను తార్క్ష్య తురంగము నెక్కి శ్రీవితో
ముందర నిత్యసూరి ముని ముఖ్యులు ప్రస్తుతులు న్నొనర్పఁగాఁ.

ఉ. రంగ విమానరాజ మతి రమ్యముగా విహగేంద్రు మూపునన్
పొంగుచు ముందర న్నిడుక భూసిరి నీళల తోడ తూర్ణతన్
న్నంగజు భ్రాతృనెదుటికిని నార్తతతోఁ జనుదేర నావుడా
సంగతి గాంచి స్వాంతమున సంతసమందుచు పొగిమ్రొక్కెటున్.

చ. ఉపనిషదోక్తులన్ దనదు యుల్లమురంజిల శ్రీరమాధవున్
కృపయు దలిర్చునట్లుగను కేలు మొగుడ్చుక బ్రస్తుతింపఁగ
న్నపరిమిత ప్రమోదతను నబ్జదళాక్షుఁడు గారవించి యా
ప్రపదన నిష్ఠకు న్నలరి పద్మజు కిచ్చె విమానరాజమున్.

కం. అతిముదమందుచు శతధృతి
సతతము శ్రీరంగధాము సద్భక్తితోనున్
యతులిత దివ్య మహోత్సవ
మతిశయముగఁ జేయుచుండె యంతట మరియున్.

చ. శిరివరుఁ గూర్చి పద్మభవు సేయు మఖంబును గాంచు వేడుకన్
సురలును మౌనులున్ జనఁగ జూచియు వారలతోడఁ గూడెటున్
తరణికులోద్భవుం డధిక ధార్మికుడైన వివస్వదాత్మజుం
డరిగె ప్రమోదితాత్ముఁడయి హాటక గర్భు నికేతనంబుకున్,

చ. గని యట నేత్రపర్వముగ గన్పడు రంగవిమానరాజమున్
మనుజవరేణ్యుడు న్నరసి మానసమందున నుత్సహించియా
వనజదళాక్ష నేను యిటు వారిజగర్భుని గొల్చి ధాత్రినిన్
తన నిజరాజధానియెడ ధన్యతగా జనులెల్ల నప్పుడున్
కనఁగొనఁ జేతువంచు కడు కౌతుకతన్ మదినూహఁ జేసిటున్.

గీ. అతులితంబైన యా మఖమైన పిదప
సబ్జగర్భుచె నిక్ష్వాకు డాజ్ఞఁగొనియు
ఘానుతంబైన సాకేత పురమునకును
సత్వరంబుగ జనుదెంచి సమ్మదమున.

చ. ధరణీభారము దీర్పఁ దక్షుని గనుఁ దా చక్రిఁగా మాత్యునిఁ
కరమొప్పఁ నియమించి సత్వనియతిఁ గంగాప్రహ్లాదీ చెంగటఁ
పరమేష్ఠిఁ గురియుంచి నిర్జరతతుల్ భావించి భీతిల్లఁగా
నిరహారస్థితిగా శతాబ్దములునుఁ నేర్పొప్పఁగా నుండఁగా.

ఉ. శారదవల్లభుండు హృది సంతసమందుచు రంగధాముతో
వారఁగవచ్చి పేర్మి యల సంధిలఁగాగ నొసంగిపోయినన్
సారస మిత్రవంశజుడు స్వామి నయోధ్యలో నిల్పె చక్కఁగఁ
వారనిభక్తియాయనఘు వంశపరంపర వారలెల్లనుఁ.

కం. తమకులదైవముగాగను
నమితప్రమోదంబుతోడ నారంగవిభుఁ
క్రమమున నర్చనజేసిరి
శమదమసుస్వాంతులగుచు సమ్మదమొదవఁ.

వ. అంత

కం. దశదిశల వార లరయఁగ
దశరథు పరియంత మటను తరలకయుండఁ
దశగళు వైరగు రాముడు
దశముఖు సోదరున కొసఁగె తమకులస్వామిఁ.

వ. ఇట్లు రఘుకులాంబుధి నిశాకరుండగు రాముం డపరిమితానంద
కందళితాంతరంగుండై తమ కులస్వామియగు శ్రీరంగధాము న్పొసం

గిన నప్పౌలస్త్యానుజు డలరి పునఃపునః ప్రణామంబు లాచరించి నయ్యసురతిలకుం డప్పుడు

చ. అలరుచు నవ్విభీషణుఁడు నార్తితో రంగవిమానరాజముఁ
గొలుపున మూపునం దిడుక ఘోరున లంకకు బోవుచుఁ న్నటుఁ
జలజహితుండునే మిహిరు చక్కఁగ నంబరమధ్యవర్తియై
నిలుచుటగాంచి యాఘనుడు నిత్యవిధుల్ యొనరించువాడునై.

కం. వరపగు చోళోర్వీందుల
కరముగ విలసిల్లు నుభయకావేరితటిఁ
స్థిరముగ శుభలగ్నంబున
శరజాక్షు విమాన మచట చక్కఁగ నిడితాఁ.

గీ. సరవితోడ నతఁడు స్నానాదికృత్యముల్
నియతమతితో జరిపి నెయ్యమొదవ
వనజనేత్రుఁ డుండు వరపట్టణముచుట్టు
తగ ప్రదక్షిణంబు తానొనర్చి.

చ. ధర నిటు సాగిమ్రొక్కి ప్రమదంబున రంగవిమానరాజముఁ
కరయుగళంబులందులను గ్రక్కునఁ బట్టటు నెత్త యించుకఁ
తరలకయున్న యంతటను తద్దయు నావుడు విస్మితాత్ముడై
తెరలుచునుండు యాఘనుని దిక్కఁగనుంగొని శౌరి పేర్మితోఁ.

మ. అశరీరాకృతి యంతరిక్షచరుఁడై యబ్జాక్షుఁ డా పుణ్యునిఁ
పరితాపంబు హరింపఁగా దలఁచి సంభావించి సుస్వాంతతఁ
పరిపూర్ణాంతకృపాసుధాకలితుఁడై భావంబు రంజిల్లఁగఁ
సురవిద్వేషణు సోదరుఁ గని యనెఁ సొంపుఁ కడుఁ సంధిలఁ.

చ. మరుగికయాలనుఁ వినుము మమ్ముఁగురించియు నిమ్మహానదీ
స్థిరతరహృద్యతఁ తపముజేసి తనందుల నన్వసింపఁగన్
వరమునువేడ నిచ్చితిని వచ్చితి నీదు కృతంబుచే యిటుఁ
యరమరలేక నేనిపుడు హర్షతగన్గొనుచుండుదుఁ యిటఁ.

గీ. ఉదధి మధ్యమందు నుండెడి యాలంక
కదశిజాడ త్రిదశ గణములైన
వదిగి తెరలుచుంద నుర్వీజనం బిట్లు
యెద భయంబునుండి నెరయరాదు.

ఉ. కావున సర్వభూజనులు గాంచెడునట్లుగ మమ్ము నియ్యెడఁ
కోవిదవంద్య నిల్పు నివు కోరినయప్పుడు వచ్చి లెస్సగా
సేవయొనర్చి పోవలయు శేముషియందుల వేరుసేయకఁ
రావలెనంచు నిత్తెరగు రంగవిభుండును యానతివ్వఁగాఁ.

చ. వినియు విభీషణుండు మది విన్నదనంబును మాని యట్లుగఁ
వనజదళాక్షుని న్నిలిపి వారని ప్రేమమహోత్సవంబులఁ
యనుదినముఁ యొనర్పఁగను యద్ధరణీధవు కాజ్ఞఁయిచ్చి దా
చనియె నిజాలయంబునకు సంతసముఁ యిటు వచ్చిపోవుచుఁ.

గీ. కలికి వినవమ్మ యదిమొదల్గాగ రంగ
పతియు నచ్చోట యత్యంత భాసురముగ
నిలచి యభ్బువి చేతన నిచయములను
సుస్థిరంబుగ పాలించు చున్నవారు.

చ. అని యిటు విష్ణుచిత్తు డతి హర్షత రంగవిభు ప్రభావముఁ
తన ప్రియకూర్మిపట్టికి ముదంబుతొ దెల్పఁగ యత్తలోదరీ

విని కడు విస్మితాత్మయయి వేమరుఁ బల్కక మౌనభావతన్
తను వివశత్వనూ కరణి తద్దయు చాల విచారణీయయై.

గీ. యట్టకేలకు జనకుని యాననంబు
గాంచి వ్రీడాభరంబును కన్నుఁగవల
నెనయ చిరునవ్వునవ్వుచు నేర్పెలర్ప
వినయ మెనయంగ నిట్లనె వీనులలర.

ఉ. ఇట్టి ప్రభావశీలుఁడగు ఇందిరవల్లభు మర్త్యబాలికన్
యట్ల వరింపశక్యమగు యత్తెరఁ గెవ్వరు మున్ను యిద్దరన్
పుట్టి యొనర్చు ప్రాజ్ఞులను పొల్పగునేయుగమందుయైననున్
పట్టుగ యుండిరే యనుచు బాలిక వేడఁగ భట్టనాథుడున్.

చ. తన దుహితాంతరంగమున దట్టిన భ్రాంతొనగూడునట్లుగన్
మనముననున్ దలంచి కడు మక్కువ నెక్కొన గారవించి నీ
వును నను వేడు నర్థమును నుర్వరయందున మున్ను గోపికల్
వనజదళాయతాక్షుని నవారితకోర్కెఘటిల్ల నందరున్.

కం. యమునాతరంగిణీ తటి
ప్రముదిత సుస్వాంతలగుచు బాలికలెల్ల
న్నముకొని వ్రతము నొనర్చిరి
యమరప్రభు భర్తగాగ తగ వరియించెన్.

ఉ. కావున నీవు నప్పగిది కంజదళేక్షణు చేతిబట్ట నీ
భావమునందు లెస్సగను పొల్పడియుండుటఁ దెల్పె నామదిన్
న్నావతో నీవు నా వ్రతము నార్తితొ గైకొని జేసినంతటన్
తావక కామితార్థములు తప్పక నీకొనగూడు మానినీ.

ఉ. ఈ యుగమందునన్ నిచుళ మేలు నృపాలుని పట్టి యీవ్రతన్
సేయుటవల్న రంగపతి చిత్తమునందున మెచ్చి వచ్చి యా
శ్రీయువతాంశజాతయగు చేడెను నుద్వహమయ్యెఁ గావునన్
వేయు విధంబులన్ మదిని వేడ్కతో యీ వ్రత మీవు జేసినన్.

ఉ. కోరిన యర్థమెల్ల నొనగూడు నిజంబిది తప్పరాదనిన్
కూర్మితో భట్టనాథుడును కూతురుకున్ వినుపింపఁగా వినిన్
సారసగంధి తాను నటుసేయఁగ నాత్మలో నూహఁజేసుకన్
ధీరతతోడ మారనెడి దిట్టతజాలక మౌనభావతన్.

ఉ. మందిరసీమ కేగి యటు మార్గశిరంబను మాసమందుల
న్నిందుని భాస్య సువ్రతము నింపొందవంగను సేయఁబూని దా
కొందరి పొత్తుకత్తెలతో గూడి ముదంబున నిత్యకృత్యముల్
ముందుగ దీర్చుక న్వేడలి ముద్దియ నెమ్మదితోడ నప్పుడున్.

సీ. శిరిగల వ్రేపల్లె శ్రీధన్వి పురమును
పరసరసి యమున వాహినిగను
బృందాటవే తన మందిరోద్యానంబు
నందసూనుడె రంగనాథునిగను
రమ నిజాంశజులైన రాధ నప్పిన్నయే
తననుగా భావించి తనదు సఖుల
వ్రజకన్యలని గోద వాంచితార్థము నెల్ల
నొనగూడ వ్రతదీక్ష నొంది నియతి

గీ. కడు ముదంబున ప్రాబోధ కాలమందు
ననుదినంబును నీరీతి నధిక భక్తి
భావమందున శ్రీరంగపతియె ధనకు
భర్తగా గోరి నోమెను ప్రాజ్ఞతగను.

ఉ. ముప్పది వాసరంబు లిటు ముద్దియలందరు ప్రొద్దుప్రొద్దునన్
తప్పక గోపికాధవుని తా మదియందు గురించి గోదయు
న్నొప్పగ బ్రస్తుతించియును నుర్వరయందు తదీయవ్రాతముల్
ముప్పది పాశురంబులుగ మోదమునన్ వచియింతు రెప్పుడున్.

క. ఇదిగాక నిందిరాధవు
విదితంబగునట్టి మహిమ విబుధులు మెచ్చన్
ముదముతో నష్టోత్తరశత
పదసంఖ్య ప్రబంధమొకటి ప్రౌఢత జేసెన్.

గీ. అవభృథంబాది కృత్యము లతిశయముగ
చూడికుడు తటు గావించి సుస్థిరముగ
నఖిలవైష్ణవతతుల కారాధనంబు
జనని జనకుల యనుమతిఁ జేసి యంత.

ఉ. కోమలి డెందమందుఁగల కోర్కెగణింప యనేకకోటిదా
భూమిధరంబులట్ల పొలుపొందుచు నుండఁగ లేమ నిమ్నతన్
వేమరు నచ్చటచ్చటను వీనుల విన్నవి కన్నవెల్లనున్
తా మది రంగధామమని తద్దయుపేర్మితో గాంచి యంచుచున్.

వ. ఇ ట్లత్యంత వ్యాప్తివ్యాపక వ్యామోహ విరహ విభ్రాంత స్వాంతయై యొందొరుల కేరికిన్ దెలియకుండునట్లుగా అహరహంబులన్ ఆహారనిద్రాదులయందు అభిలషించక తనలోదాను పరితపించుచు నిట్లని వితర్కించె.

ఉ. శ్రేయముఁగల్గు యీవ్రతము సేయుమటంచు మదీయ తాతయున్
పాయనిభ్రాంతి దెల్ప నిటు పాల్పడిజేసినవల్ల నేమియా

దాయమువచ్చెనంచు మది యందును గుందుచు తాళఁజాలక
కాయమునందు రంగపతి కౌఁగిలి యబ్బునొ యబ్బదో యనిన్.

ఉ. ఇందుకు సాధనేమి యిక నెయ్యది తోచదటంచు తా మదిన్
కందుచు కుందుచున్ హృదిని కళ్వళమందుచు లేచి యిట్టటున్
మందిరమందునన్ దిరుగు మాన్పడి యొక్కచొ నిల్వఁజాలకన్
ఇందునిభాస్యని త్తెరఁగు యిచ్చలొ నేమియు తోచ కప్పుడున్.

మ. పరితాపంబున నెక్కి చిక్కి భయమున్ భావంబునన్ బెన్గొనన్
హరిచిత్తాత్మజ యిత్తెరంగున మహాస్వాత్మాంతరవ్యాప్తతన్
విరితల్పంబున విశ్రమంచి యవరిన్ వీక్షింపకన్ సుప్తతన్
నెరయ న్నుండఁగ యానిశీధిని కడున్ నేర్పొప్ప శ్రీకాంతుడున్.

చ. తరుణిలలామ స్వప్నమున తా మును ధ్యానముజేయు రూప్యతన్
కరుణకటాక్షవీక్షణల కస్తురిరంగడె సుందరాంగుడై
అరమరలేక వచ్చి కడు యార్తితొ కౌఁగిటజేర్చి యింపుగన్
సురతసుసౌఖ్యలీలలను కూడికొడుత్త మనోహరంబుగాన్.

చ. కలిమిడిగాను వచ్చి మెయి గాశిలిఁదీరఁగ కౌగిటందు దా
నలముక మోవితేనియలు వానుచు పేర్మితొ కుత్సరింపుచున్
వెలఁదిని బ్రంహగారడపు విద్యచె మోహతనొందఁజేయుచున్
తెలతెల వారుదాక తమిఁదీరఁగ గూడి యదృశ్యమానుఁడై

చ. చనిన యనంతరంబునను సారసనేత్రియు మేలుకాంచియున్
తనువున కంపమున్ భయము తాపము మోహము భ్రాంతి దాంతియున్
పెనఁగొనలేచి కన్గవలు భీతమృగేక్షణయౌచు వల్లికల్
గనుఁగొని తా ప్రియుం గనక కల్వళమందుచు స్వాంతమందులన్.

చ. కలయొ నిజంబొ విభ్రమమొ కాగలయర్థమొ కాంతుమాయయో
తెలియ విచిత్ర మీ మహిమ ధీరత నేరికి యేమి దెల్పఁగ
న్నలవడదంచు గుట్టుగను నాత్మసఖీజనసంఘ మెంతగన్
పలుమరు వేడినన్ దనదు భావముఁ దెల్పక బుక్కియాడుచున్.

ఉ. కూరిమియైన చేడె లనుకూలతఁ గల్గిన తల్లి దండ్రియున్
గారవ మొప్పఁగా పొదివి కౌగిటఁ జేర్చక యెంతవేడినన్
వారిజగంధి తా మదిలొ వాంఛిత మించుక వారితోడనున్
కూరి మెలర్పఁ దెల్పకను గొంకుచు వేరొక జాలి నేర్పునన్.

క. మరపించి తనలోఁ దానున్
పరితాపము నొందు నెపుడు బహువిధగతులన్
విరిశయ్య యందు ముంగిట
స్మరశర వశమైనయట్లు శయనించి యటున్.

వ. ఇట్లు విరితల్పంబునన్ శయనించి విరహవేదనమున శ్రీరంగ ధాముని( గురించి యిట్లని వితర్కించె.

చ. తలపున లేని భ్రాంతి నిటు దబ్బరమాయలఁ బన్ని చౌర్యతన్
కలలొను డాసి యిట్లుగను కాయము సోయి నెరుంగకుండగన్
కలసియు నిర్దయత్వమున గన్పడి యిట్లు తొలంగిపోవుటల్
జలజదళాక్ష నీకు నిది సంగతమా! ఫల మేమివచ్చెరా.

చ. అనిశ మహర్నిశంబు గడు యాత్రితొ నన్నిటు యెత్తి పెంచినన్
జనవియు జన్కు డాదియగు సర్వసుహృజ్జన బంధుజాలముల్
ననుఁ గవి విస్మితాత్ములఁబు నమ్రతగాగను యెంత వేడినన్
మనమున నుండు నున్మలిక మాటును వేసుక తెల్పి చెప్పఁగన్.

చ. కనుపడ కిట్లుగా మదిని కళ్వళమందుచు ముంగిటందులన్
నిను మదిలో దలంపుచును నిద్దుర కంటికిరాక రేబవల్
మనసిజు బాణబాధలకు మారుత వేధకు చంద్రుకాకకున్
తనువున కంపమున్ బొడమె తాళగజాలను రార మ్రొక్కెదన్.

క. అని యిటు తన డెందంబున
వనజాక్షు గురించి హృదిని వర్ణింపుచు తత్
క్షణ మొక్క యుగముగాగను
తన మది యూహింపుచుండె తహతహపడుచున్.

వ. ఇట్లత్యంత విరహ విభ్రాంత మానసయై యుండు నయ్యెడ.

సీ. కలికి చిలుకల రొదల్ కర్ణశూలములయ్యె
శారికాధ్వను లతి ఘోరమయ్యె
మలయ మారుత మగ్నిమాలిక లయ్యెను
నుడురాజ బింబంబు నూష్ణమయ్యె
అంగుళీయంబులు హస్తకంకణులయ్యె
నగరు మలయజపంక సెగలునయ్యె
విరిశయ్య మేనికి శరతల్పమయ్యెను
పానీయములు విషప్రాయమయ్యె
గీ. తారహారంబు లత్యంత భారమయ్యె
ననుచు విశ్లేష ముదావహము యలసి సొలసి
నిలయమందున పదమూని నిల్వ కెపుడు
విరహ విభ్రాంతిచే నిటు తిరుగుచుండె.

వ. మరియును,

సీ. తోయంబులాడదు తోయరుహానన
ముకురంబుఁ జూడదు ముద్దుగుమ్మ
పెన్నెరుల్ ముడువదు బింబాధరోష్ఠియు
కలుపంబు బూయదు కంబుకంఠి
తిలకంబు నుదుటిపై దీర్చదు చక్కఁగా
కనుల కాటుక నిడదు కమలనేత్రి
యలరుచు చెలులతో నాటలు నాడదు
వనవిహారము కేగ వాంఛపడదు
గీ. నతి భరంబున నీరీతి యబ్జవదన
మౌనభావంబుచేత నా మగువ మదిలొ
కలలొ గన్నట్టు తన ప్రియకాంతు నెపుడు
నురువఁజాలక నిట్టట్టు తిరుగుచుండు.

ఉ. ఆ విధమెల్ల రంగవిభు డాత్మ నెరింగియు తాపమొందుచున్
భావము నందు మెచ్చి తన ప్రాపున నిల్పి సపర్యలెప్పుడు
న్నావతొ సేయుచుండు గజయానను చామరగ్రాహిణీయనే
శేవకురాలినిం గనియు చిత్తము రంజిల చేరఁ జీరియున్.

చ. విను మొకమాటఁ జెప్పెదను వేగమె నీవటు సంశయించకన్
చనవలె ధన్వినామపురి చక్కటికిన్ కడు వేడ్కతోడ యా
యనఘుఁడు విష్ణుచిత్తముని యాత్మజయౌ వరవర్ణినింగనిన్
మనసున నుండు వ్యాకులము మానెడునట్లుగ నీవు మక్కువన్.

చ. అతి వినయానురాగమున యా సతితోడుత సఖ్య మింపుగన్
యతి ప్రియమంద జేసియును మానిని యాడకు నెల్లభంగులన్
హితమతితోడఁ దేవళియు యింపుగ నీవని రంగభర్త దా
నతిముదమందుచు న్నిటుల నానతినిచ్చిన నుత్సహింపుచున్.

గీ. కరయుగము మోడ్చి చామరగ్రాహిణియును
కనుఁగవల నశ్రుపూరముల్ గ్రమ్మకొనఁగ
నిందిరాధవు పాదారవిందములను
వ్రాలి మెల్లన నిట్లనె జాలియొదవ.

క. దేవరవారల కంతగ
కావలసిన పనియు నేను గైకొనుటకునున్
పావన నియమము బూనుట
కావలసిన పనులు మీకుఁ గాకనుయున్నే.

ఉ. కల్లయుఁ గాదు మీ చరణ కంజయుగంబుల యానసుమ్మి నా
తల్లివి దండ్రివిం గురువు దైవముఁ దాతవు భ్రాత వీవనిన్
యుల్లమునందున న్నెపుడు నుబ్బుచు మీకడఁ దాసదాసినై
మెల్లనగాగనున్ వదిగి మీకు సపర్యల చేయుచుందునున్.

ఉ. ఉండెడు నన్ను యేల యిటు నూరక యింతగ సామినేమిటున్
కొండొకదానిఁగా దలచి కూరిమి మీమది యంతగల్గినన్
కుండలితల్ప యింతగను గొప్పయుసేయఁగ యంతదాననే
నండజవాహ యంచు నతి హర్షము మ్రొక్కిటు విన్నవింపఁగన్.

ఉ. విని మది నుత్సహించి యరవిందదళాక్షుఁడు యత్తలోదరిన్
గనియును విస్మితాననుడు గౌరతగా యటుజేరఁజీరి నీ
మనమున చింతయేల విను మాకు ప్రియంబగుదాన వౌటచే
నిను నిటు పంపఁగావలసె నెమ్మదితో జను సంశయించకన్.

గీ. అనిన ముదమంది యాలేమ యాజ్ఞఁగొనియు
చనియె కతిపయగతి నతిపత్వరముగ

సైంధవారోహణముజేసి సఖులతోడ
ధన్విపుటభేదనాఖ్యతోఁ దనరు పురికి.

చ. అరిగటు నాపురీవరము కాధ్యుడునౌ వటపత్రశాయిని
న్నరసి ప్రమోదహృద్యమయి యార్తతతో ప్రణమిల్లి చక్కఁగన్
శిరివరుఁడైన రంగపతి శేముషిరంజిల పంపినట్టి యా
యురుతరభూషణాంబరము లొప్పుగ నప్పనసేయ వారలున్.

క. అరుదందుచు నతిముదమున
సరవితొ గైకొనియు పేర్మి సంధిలగానున్
శిరి భువి నీళలు తానున్
కరముగ ధరియించి రధికకౌతూహలతన్.

క. సామజవరదుఁడు యిటుగన్
చామరగ్రాహిణిని యధికసమ్మోదమునన్
ప్రేమదలిర్పఁగ తమ నిజ
ధామంబున నిలిపె పేర్మి దళుకొత్తంగన్.

ఉ. ఆతత విష్ణుచిత్తముని యాత్మజయైన రమావధూటినిన్
స్వాంతమురంజిల న్నరయ చామరగ్రాహిణి శ్రీశునాజ్ఞచే
భ్రాంతిని వేగ నాయువతి ప్రాంగణసీమకు చేరనేగి యా
కాంతనుగాంచి మెచ్చి తన కౌగిటజేర్చుక గారవించియున్.

గీ. అమ్మ వినవమ్మ మహిమను ఆర్యులెల్ల
సంతసంబున శ్రీరంగశాయి మ్రోల
సన్నుతిని సేయఁగా విని సంభ్రమమున
నిమ్ము సేవింపవచ్చి మాయమ్మ నిటకు.

చ. అన విని భట్టనాథసుత హర్షత నాననపద్మమందులఁ
ఘనతరమైన హాసమును కన్గవయందున అందమొప్పఁగఁ
తన తనువందునఁ గలుగు తాపభరంబును బాయ నిట్టులఁ
మనసున వేరుసేయ కతిమక్కువ కౌగిటచేర్చుకఁ వెసఁ.

మ. అనురాగంబున వారలిర్వురు మహాయానందతఁ పొందుచుఁ
వనజాతాయతనేత్రు సద్గుణములఁ వైయ్యాత్యత న్నెప్పుడు
న్ననుసంధింపుచు మెచ్చుచుఁ సొలయుచు న్నాంతర్యభావంబునఁ
న్ననుమానంబునులేక ప్రత్యహ మిటు న్నానందతఁ చక్కఁగాఁ.

చ. అరమరలేక నిర్వు రిటు లైక్యతగా యెడసేయకుండియుఁ
సరసముగాగ నాయనఘు సద్మమునందున నిల్చి భక్తిని
న్నిరతముసేయుచుంగలిసి నెయ్యముసంధిల నేకశయ్యలఁ
మురియుచు పవ్వళించి మరి ముచ్చటలాడుచు సుప్తినొందుచుఁ.

చ. సతతము నిత్తెరుంగునను చామరగ్రాహిణి భూపిరాట్టితో
నతులితమైన సఖ్య మెదయందున నప్పు డహర్నిశాదులఁ
హితమతితోడుత న్నిలిచి నీప్సితమందున గల్గు భావముల్
చతురతతో గుణాతిశయ సౌఖ్యత నొందొరు లేకతంబునఁ.

గీ. కలసి యిష్టగోష్ఠి గావించు చొకనాడు
నితరు లెవ్వ రించు కెరుఁగకుండ
శేముషలర విష్ణుచిత్తాత్మజను గాంచి
యతివ మదిలొ భావ మరయఁదలచి.

చ. కమగవ విన్ననవ్వొదవ గ్రక్కున చెక్కిలి ముద్దుగొంచు నీ
మనసునఁ గల్గు వ్యాకులమ మామదియందునఁ దెల్పిదెల్యకఁ

పని(బడి నిన్ను వేడ(గను భ్రాంతిపుటిల్లెడు(గాన నీమది
న్నను పరదాని(గా దల(చి నమ్మవదేమొ ప్రమాణమిచ్చెదన్.

చ. సరసముగాగ యాసతికి చామరగ్రాహిణి నమ్మి నవ్వ(గా
కరము కరంబునందులను గ్రక్కున(జేర్చియు మేను నిమ్రుచున్
తిరముగ నింక నీమదిని ధీరముగా నిటు( దెల్పుమంచు న
త్తరుణీలలామ యాననము తానటు యెత్తిన యెట్టకేలకున్,

క. చిరునగవు యాననంబున
నెరయు(గ నల్దిశలనరసి నెన రెద నొదవన్
సరసముగాగను యిట్లనె
వరవర్ణితో సధికమధురవాక్యముల తగన్.

ఉ. అగ్గలమైన లజ్జ మదియందున దట్ట(గ వాఃకవాటమున్
దిగ్గున దెగ్గరన్వయిచి తీరుగ యాసతి జిహ్వాయందునన్
బిగ్గర దాసియుండునటు భీతిలు చేమియు మారు(బల్కకన్
సిగ్గికనేమి ? యంచు నిటు శేముషి ధీరత(జేసి దెల్ప(గాన్.

క. ఘప్పున యంతర్భావము
నప్పుడు తా( జెప్ప(జాల కపు దెదలోనన్
దప్పియు వేరొకజోలియు(
జెప్పుచు నఱజెప్పి గ్రుక్కి చిదుముడివడగన్.

గీ. చామరగ్రాహి జాలేమ చందమరసి
తా మనంబున వ్యంగ్యత దట్ట కలరి
యేమిభయమమ్మ నీకేమి యిటుల( జంక
వలదటంచును వెన్నరిచి బలికె నపుడు.

ఉ. కన్నియ నీవు ప్రాజ్ఞతయు గల్గిన ప్రౌఢవుగావు నీవు ము
న్నెన్నడు కన్నులం గనని యిందిరవల్లభుఁడైన రంగవిఙా
సన్నిధిఁజేయు భ్రాంతి యెద సంధిలి నీవిటు వ్యాకులత్వముఙా
మ్మున్న విధంబు తాదెలసి నొయ్యన నన్నిటుబన్ప వచ్చితిఙా.

క. అని యిటు సాకల్యంబుగఁ
దను వచ్చిన కార్యమెల్ల దాచక సతితో
వినుపింప కూడికుడు తటు
మనమున సంతోష మెలమి మల్లడిగాగఙా.

చ. కనులకు రెప్ప లెల్లపుడు కాపయియుండెడిమాడ్కి నీవు నఙా
న్ననిశము యించుకేమరక నార్తతఁగా తలిదండ్రులట్లఁగా
మనసున యెగ్గులేక కడుమక్కువతో నిటుఁ గారవించఁగా
తనదె యకృత్యమౌ ననెడు తాత్పరియమ్మున నెత్తినెత్తకఙా.

సీ. శ్రీరంగపతి దెల్పు స్థితిఁ దెల్పి యిటవచ్చి
యరసి యింకేమని యడిగె దిపుడు
యైన నా వాజ్మాల మరయ వేడుకయైన
జెప్పకుండుట యది గొప్పగాదు
యప్పరో విను నాదు యాంతర్యమందున
గల కోర్కె దీర్పగాఁ గలిగినట్టి
ఆప్తులు నీకన్న యరయ మాకెవ్వరు
మది పరాకునుగాక విదితముగను

గీ. వినుము సాకల్యముగ నాదు విన్నపంబు
ననియు విస్మితముఖియగు నబ్జవదన
కరము కరమున జేర్చిటు గారవముగ
భావితార్థంబు నిటు తెలుపఁగ ననియె.

చ. అనవరతంబు మజ్జనకు డార్తత నావటపత్రశాయికిన్
ఘనసుమమాలికల్ యొసఁగ కాంక్షఘటిల్లి ప్రసూనకాననం
బనువగుచోట తోటకయి యన్నగరాద్యుల యాజ్ఞగైకొనిన్
పనిఁబడి తా స్వకీయముగ పాదపజాలము బ్రోదొనర్చుచున్.

చ. అనుదిన మిత్తెరంగునను నబ్జదళాక్షుఁడు పుష్పమాలికల్
వినయత మద్గురుం డొసఁగు వేడుకతో విరితోటకేగ నే
వెనుకొనిపోయి నయ్యెడల వింతలుగన్గొని సంతసించుచున్
పనిఁబడి యిట్లహర్నిశము పాల్పడి చక్కగనుండు నయ్యెడన్.

గీ. అమ్మహామహుండు నత్యంతభక్తితో
సకలదివ్యదేశ సదనములును
భావమలర లెస్స వర్ణింప నే విని
యంతరంగమునను హర్షమొదవి.

గీ. ఇన్నియెడల విట్లు యిందిరాధీశుండు
నేమికారణమున విట్లుయునికి
వినఁగ మదికి చాల వేడుకనయ్యెడు
నానతీయుఁడనిన యాఘనుండు.

చ. మది ముదమంది నన్నరసి మక్కువనెక్కొనఁ గారవించి దా
సదయత విందిరాధవుఁడు సర్వజగజ్జనలక్షణీయుఁడై
విదితముగాగ యుండుటచె విశ్వమునందు తదీయవ్రాతముల్
ముదముతో బ్రస్తుతింపఁగను ముక్తికరంబగు నమ్మ మావిపీ.

కం. ఆరయగ నన్నిటికంటెను
శిరివరుకు మనోహరంబు శ్రీరంగంబున్

ధరణిలో యంచును బుధులను
నిరతముఁ గొనియాడుచుండ్రు నియతాత్ములునై.

కం. అనియిటు నస్మజ్జనకుఁడు
తనమదినిం గలిగినట్టి తాత్పర్యంబున్
వినుపింపఁ వినియు నేనా
యనఘునిదెసఁ గాంచి మగుడ యపు డిట్లంటిన్.

కం. పరమపదవాసుఁడగు హరి
ధరణిన్ యర్చాస్వరూపధారుం డయ్యున్
నరు లెదఁ గోరెడు గోర్కెలు
వరదుండై యట్లొనర్చె వారనికృపచేన్.

ఉ. ఆవిధమెల్ల మీర లిపు డానతినీవలెనంచు వేద నా
కోవిదవంద్యుడున్ న్నలరి కూరిమి నాయెదఁ జాలగల్గుటన్
భావమునందు రంజిలుచు బాగుగ నన్గని మోదితాత్ముఁడై
నావిధమెల్ల నీకిపుడు యమ్మరో దెల్పెద నాలకింపుమీ.

చ. అవి వినయానురాగమున నస్మదభీప్సితమైన నాస్థితిన్
తనమదియందు లెస్సగను తాల్మితో గ్రాహ్యత జేసుకన్వెసన్
నను కరుణాకటాక్షతను నమ్రతగా నటు గారవింపుచున్
మనసు పరాకుగాక వినుమంచును యిట్లనె సారసోక్తిగన్.

ఉ. విను ముమ గోపకామినులు విశ్వమయుండగు నందనందనున్
మనమున తా వరించి హృది మక్కువబెన్గొన సద్వ్రతంబునన్
న్ననిశము ప్రత్యుషంబునను యార్తితతో యమునాతరంగిణిన్
జానుగక నిల్చి చక్కఁగను సుస్థిరమాననులై యొనర్పగాన్.

చ. తననుగురించి యిట్లు దయితామణులోర్చు వ్రతంబుకు న్మదిꣳ
పవజదళాక్షుఁడైన యదువల్లభుఁ డార్తితో వారినందరిꣳ
మనసిజక్రీడలం గలసి మక్కువనేలెనుగాన నిఖ్బువిꣳ
పనిఁబడిసేయువారలకు భవ్యుడునై యటు వేరుసేయకꣳ.

వ. అనియిట్లుగꣳ జనకుం దప్మꣳ మనోగతవై కల్యంబుఁ దీరునట్లుగా యానతిచ్చినఁ విని సంతుష్టాంతరంగనై యేను సర్వాంతర్యామియగు శ్రీరంగధాముంగూర్చి యత్యంతనియత నిష్ఠాగరిష్ఠంబుగా తద్వ్రతంబుఁగావించిన యనంతరంబ కొన్ని వాసరంబులకు మదీయ స్వప్నంబున జగన్మోహనాకారుండగు శ్రీరంగనాయకుం డరుగుదెంచి యత్యంతానురాగంబునఁ గలిసిమెలిసి యదృశ్యాకారుండైన; తద్విరహ విభ్రాంత దోదూయమానాంతరంగనై యివ్విధంబున నహర్నిశంబులు క్షుత్పిపాసాదివర్జితనై పరితపించుచున్నదాన నని పమర్మకంబుగా విన్నవించి విషాదవదనయగుచు నున్న యమ్మానినీమణిꣳ ఉపగూహనంబునం గౌగిటంజేర్చుకొని గారవించి చామరగ్రాహిణి మెల్లన మృదుమధుర భాషణంబుల నిట్లనియె.

ఉ. ఇందుకు నీమదెందులను నింతగ చింతిలనేల విన్మికꣳ
సందియమందగావలదు స్వామికృపꣳ యిటు చక్కనయ్యెడుꣳ
డెందమునందు యింతగను డిందుననొందక లెమ్మటంచు నా
యిందునిభాస్య నూరడిల యింపుగ లాలనజేసి యిట్లనెꣳ.

మ. కలయందుꣳ గనుగొన్న వెల్ల నిజముꣳ గాదంచు నీవింతగా
తలపోయꣳ వలదమ్మ చూడుమిదియే తథ్యంబు నీకయ్యెడుꣳ
జలజాతాసన నాదుమాట విననꣳ సౌఖ్యంబు నీకబ్బెడుꣳ
పలుమారుల్ వివరింపనేల వినుమా భావంబుతుꣳ దెల్యగాꣳ.

ఉ. ఎన్నివిధంబుల న్నరయ నిందిరవల్లభుఁడైన రంగనిఁ
కన్నులనిండయుఁ గనక కానియు నెక్కొని యుండు మోహముఁ.
తిన్నగ వేరుదెల్పినను తీరునె కోమలి నీమనంబులో
నున్న విచారభావములు యూరకఁ దీరదు నెల్లభంగులఁ.

క. అదిగాన నీవు యిప్పుడు
మది సంశయమెల్ల మాని మావెనువెంటఁ
కొదుగక శ్రీరంగేశ్వరు
సదనంబున కొచ్చితేవి చక్కంబడుగా.

చ. అన విని విష్ణుచిత్తసుత హర్షత చామరగ్రాహిణిఁ గనిఁ
కనుగవ పిన్ననవ్వొదవ కాగల యర్థము నేమొగాని నీ
వనిన విధంబు మజ్జనకు నాజ్ఞయు లేకటు వచ్చుటెట్లగు
న్ననబడునమ్మ యిత్తెఱఁగు నన్యులు నెవ్వరు విన్న మెత్తురే.

ఉ. ఇందుకు సాధనెయ్యదియొ యేమ మదిఁ దెలియంగజాల నో
యిందునిభాస్య నీవు మది యిన్నివిధంబులఁ జక్కఁజేసినా
డెందమునందు బెన్గొనెడి డిందునుదీరి ముదంబునొందఁగా
చందనగంధి పొందికయు జేపెటిభారము నీదె సుమ్మికఁ.

వ. అని యిట్లత్యంతదైన్యావనమానసయై గోదావధూలలామంబు వినయవినమితభావానురాగంబున తనయంతర్భావంబు సమర్మకంబుగా చామరగ్రాహిణితో విన్నవించిన యమ్మానినీమణి విస్మితాశ్చర్యాతిశయస్మితాననయై ధైర్యావలంబితయగుచు సౌవర్ణంబుగా మరియు విట్లనియె.

ఉ. శాలిమిదూలి యిట్లు పరితాపము నొందకు భద్రమయ్యెడిఁ
కాలము వేడు పంపుటిలె కావున నేనము వాక్యవద్ధతుల్

మూలము యెల్లనుం దెలిపె ముద్దియ వీదు సుహృజ్జనావళిన్
చాలముదంబుతోఁదుతను చక్కఁగ రంగముకొచ్చె టట్లుగన్.

చ. ఎటువలె నేడుఁ జేసెదను యేటికి నీమది యానొకాదనే
కుటిలత మాని యుండు మిక కోమలి నీవును నూరడించి తా
తటుకున భట్టనాథుఁగని తత్పదయుగ్మములందవ్రాలి నే
యిటు తమచేత యాజ్ఞగొని యేపనివిందు నెరుంగు మందుకున్.

ఉ. అయ్యెడ శ్రీరమారమణు కార్యము నెల్ల మహోత్సవంబునన్
నెయ్యముతో నొనర్పఁగను నేను కనుంగొన కిట్లు వూరిక
న్నియ్యెడయుండుటన్ బనియు నేమిక యాజ్ఞయొసంగుమంచునుం
దొయ్యన విన్నవింపఁ బరితోషితస్వాంతుఁడు నౌచు నావుడున్.

ఉ. తామును యమ్మహోత్సవ ముదారసుతాప్తసుహృజ్జనాదులౌ
స్తోమముతోడ యాత్రగను సొంపుదలిర్ప ప్రయాణమౌటచే
చామరగ్రాహి బందులకు సమ్మతిగా యనువాక్యసంగతుల్
తా ఘుది మెచ్చు చందరు ముదంబున వెల్వడి రుజ్వలాంగులై.

వ. ఇవ్విధంబున యన్నగరస్థితాశేష తదీయచేతనవ్రాతసందోహంబులు స్వకుటుంబాది సంయుతంబుగా వటపత్రశయనానుమతిన్ వెడలి కతిపయగమనంబుల శ్రీరంగనామపుటభేదనంబునకు చేరంజనునెడ విష్ణుచిత్తుండు జాయాసమేతంబుగా తనదుహితయగు గోదావధూలలామంబును సకలమణిమయాంబరాభరణభూషితఁగా నలంకరింపంజేసి చతురంతయానంబునన్ విడుకొని అత్యంతాతిశయంబున తమవారలం గలసి తిరుక్కావేరీతటంబునకుంజని సత్క్రమంబుగా స్నానసంధ్యాది కృత్యంబులు సత్వరంబుగా దీర్చుకొని పాదచారులై బెరుమాళ్ల సన్నిధికిన్ జనుదెంచుచుండు నయ్యెడ.

ఉ. అంతకుమున్నె గోదసతి యాజ్ఞచె చామరగ్రాహి ణంతటన్
సంతసహృద్యయౌచు నతిసత్వరతన్ యటు రంగశౌరి కే
కాంతమునందు నాస్థితియు గ్రక్కునఁదెల్పఁగ మోదమంది సు
స్వాంతుఁడు నౌచు నిట్లనియె సాధ్విని నీవిటు తోడితెమ్మికన్.

చ. అని యిటు లానతివ్వఁగనె హర్షత చామరగ్రాహి జేరికిన్
కనపడకుండ యాతరుణి గ్రక్కునఁగై కొని స్వామిసన్నిధిన్
వినయమెలర్ప నిల్పగను వేడ్కతొ శ్రీహరిఁగాంచి మెచ్చుచున్
ఘనతగ మున్ను తా కలనుఁగాంచిన దాకల దాకలాయనిన్.

చ. వనితకు సంత గన్పడిన నుల్లమునందున సంతసింపుచున్
మనమున నించుకైన యనుమానములేకను పేర్మిసంధిలన్
వనజదళాక్షి పాదముల వ్రాలిన లేమను గాంచి మెచ్చుచున్
తన కరయుగ్మమందులను తద్దయు భ్రాంతితొ నెత్తి చక్కగాన్.

క. సరసముగ తనదు చెంగట
హరిచిత్తుని సుతను నునుప నాయమ యపుడున్
మురియుచు శిరి భువి నీళల
చరణాబ్జములందు వ్రాల సరగున వారల్.

క. అమితప్రమోదితులగుచును
తమకరముల గ్రుచ్చియెత్తి తద్దయు పేర్మిన్
క్రమమున ముప్వురు గ్రక్కున
కమలాక్షిని గౌరవముగ కౌగిటఁజేర్చిన్.

గీ. ఉచితసద్గోష్ఠిగావింపుచుండు నచట
నతిముదంబుతో తిరువీథులందు వచ్చు
వరుసలోపల హరిచిత్తుపట్టి యువికి
నరయఁజాలక జాలిచే నంద రంత.

గీ. పరితపించుచు నటువచ్చి భట్టనాథు
గాంచి కన్గవ నశ్రువుల్ గ్రమ్ముకొనఁగ
నంఘ్రియుగములపైబడి యార్తితోడ
తహతహతజెంది యని రిట్టు దైన్యముగను.

సీ. ఏమయ్య మీపట్టి యిందాక మాతోడ
యనువందగా ముచ్చటాడుకొనుచు
నరుదెంచి యిపు దేమొ యగుపడ కేగెనొ
కనుపడ దిదియేమొకాని వినుడి
యెదురుగా నిందాక నేతెంచుగుంపులో
నెరుకవా రెవరైన సరగ దారి
కనుపడినందున కలయరాదయ్యెనో
యాజాడ మీరలు యరసికొనుఁడి

గీ. యనుచు వినుపింప హరిచిత్తు డాత్మయందు
బెగడునొందుచు నిట్టట్టు వెదకి సుతను
నరయఁజాలక పరవశు డగుచు వేగ
స్వామిసన్నిధికేగి యాసముఖముననుఁ.

చ. తనసుత జాడఁగానకను తత్తరమందుచు జాలినొందుచున్
తనువున కంపమంది పరితాపమునొందుచు బాష్పధారలున్
కనుగవయందున న్నురుల కల్వళమందుచు స్వాంతమందునన్
ఘనతరమైన వ్యాకులత గాఢతరంబుగ నావిబెన్గొనన్.

చ. శిరిధవుడైన రంగపతి జేసిన మాయయు నంచు నేరికిన్
సరిగను దెల్య దేరికి నశక్యము నంచును నిశ్చయించి తా
హరిచరణారవిందముల యందున మ్రొక్కియు దైన్యభావమున్
తరలకయున్న యత్తెఱఁగు తామరసాక్షు డెరింగి సత్కృపన్.

చ. కరుణయుబిల్కు రంగపతి గ్రక్కున గోదవధూటితో ననె
న్నర సిటు జూడు మీ జనకు డార్తత నీకయివచ్చి తామదిఁ
తరగని భ్రాంతి యిట్లగను తా మదిగుందుచునున్నవాడు నీ
వరిగియు నమ్మహామహాని హర్షమునొందగసేయు పొమ్మనన్.

కం. ఆనతిచ్చిన యాలేమ హర్షమంది
తా విజాకృతితోడుత తండ్రికడకు
నానుకూల్యతగాగను యరుగుదెంచి
కానుపింపగబడి యనె గౌరవముగ.

ఉ. ఏమిటి కిట్లు మీమదిని యింతగ వ్యాకులమంది నీక్రియఁ
స్వామియు సమ్ముఖంబునను సర్వజనంబులు గాంచి నవ్వగా
భ్రామికతోడ యిట్లునికి భావ్యముగా దిక లెమ్మటంచు నా
హామికతోడుతఁ జనకు హ స్తయుగంబులు బట్టి యెత్తగాఁ.

గీ. వివశతెల్ల మాని విస్మితుం డగుచును
కనులనిండ సుతను గాంచి మదిలొ
యింతతడవు నేను యెంతగా వెదకిన
నరయజాలనైతి ననుచు నపుడు.

చ. అలరుచు పుత్రికామణిని యక్కున చక్కగ జేర్చి మక్కువఁ
అలకలు కేలఁదువ్వుచును వార్తతతోడ శిరంబు మూర్కొనిఁ
తలపున వ్యాకులం బుడిగి తాల్మితొ యిందిరనాథుఁ గాంచి దా
యలుకువ నొంది యిట్లనియె హర్షముతోనెయు విష్ణురో క్తిగాఁ.

మ. జగదారాధ్యుడవయ్యు నీవు యిటుగా చౌర్యస్థితిఁ మాయెడఁ
తగునా ధర్మముదప్పి యిత్తెరగునఁ దౌష్ట్యంబు గావించుటల్

పగవారైతిమొ మీకు నేటికిటులన్ భంజింప భావ్యంబెకా
తెగియిట్లుగా నగుబాటుపేయు టదియెంతే యింక నిన్నేమనన్.

ఉ. అంతగ మాతొ వియ్యమును నందగ మీమది భ్రాంతిగల్గినన్
సంతసమందునట్లు మము సమ్మతిఁబెట్టక నిట్లు ధూర్తతన్
న్నింతిని నీవు ధూర్తతను నిట్లుగగైకొని వచ్చుటెల్ల మా
స్వాంతమునందు వ్యాకులత నందిలఁజేసితి విట్లు నిర్దయన్.

ఉ. పిన్నతనంబునందునసె పేర్మితొ చౌర్యమునన్ యశోదయున్
వెన్నతొగూర్చి యుగ్గిడెనె వెన్నుఁడ నీకిది యింపుగాగనున్
మున్నటు గోపబాలికల మోహమునొందఁగ మాయబన్నియా
పన్నతఁజేసి యిట్లుగను పాల్పడజేసితి నేడు మాసుతన్.

చ. అనగనె నిష్ఠురోక్తులిటు లబ్జదళాక్షుని సమ్ముఖంబునన్
తనకత విష్ణుచిత్తుఁడెద తాలిమిమావి వచింప నావుడున్
విని దరహాసవక్త్రుఁడయి వ్యంగ్యతనొందక చేరజీ రిటున్
తనకరపల్లవంబులను తన్వును నిమ్రుచు సారసోక్తులన్.

ఉ. ఎందుకు మీమనంబులను నింతగవ్యాకులమందుచు న్ననున్
నిందనొనర్చ నేమిటికి నీసుత మాకయి సద్వ్రతంబు విం
పొందుగ ముం దొనర్చుటచె పొల్పుగ నేడు ఘటిల్లె కావునన్
నందియమందతన్ వినుము చక్కఁగ మీ రిపు డన్నకైవడిన్.

ఉ. వచ్చెద మీమదిన్ గలుగు వాంఛితమెల్లను దీరునట్లుగ
న్నిచ్చెద మమ్ము దూరకను విప్పుడు మీసుతతోడ చక్కఁగన్
చెచ్చెర మీవివేకముకు చిత్తమురంజిల నేగుడం చనన్
యచ్చెరువందుచున్ తనదు హస్తయుగంబులు మోడ్చి యిట్లనెన్..

క. చపలమతినగుచు మీకుఁ
న్నపరాధము చాలఁజేసి తది మీ రిపుడుఁ
కృప సెమియింపుం డంచును
ప్రపదనముఁ జేయ రంగపతి హర్షించెఁ.

చ. కరముగ మీరు మే మిపుడు కల్మిడిగాగను వియ్యమందుచు
న్నరమరలేకయుఁ మనసు నైక్యతమయ్యె శుభప్రయత్నముఁ
జరుగుడు సేయ కిప్పుడును సత్వరతఁ యొనరింపగాదగుఁ
పురమున కేగుదెంచ గురుపుంగవు కాజ్ఞనొసంగ నావుడుఁ.

చ. మది ముదమంద నిట్లనియె మాధవ నీదు మహోత్సవం బిటుఁ
విదితముఁగాగ గస్గొనఁగ వేడ్కతొ యింతగ వచ్చి కాంచగఁ
కదలియుబోవఁగా యెదుర కన్పడ వార లిదేమి యన్న దా
బదలన మారుమాట యన భావమునందున తోచదేమియుఁ.

ఉ. కావున యిమ్మహోత్సవము కన్నులనిండఁగ గాంచి యంతటఁ
దేవరవారి యాజ్ఞఁగొని తిన్నగ మానిలయంబు కేగుటల్
శ్రీవర యెల్లభంగులను శ్రేయము మాకిది గాన మీరలుఁ
భావమునందు మామనవి బాగుగ నేడు గ్రహించగాదగుఁ.

చ. అన విని యిందిరాధవుఁడు నట్లగ మీమది కాంక్షఁదీరఁగఁ
కనుగొని యుండు డంచు నతిగౌరవమొంద సుహృజ్జనాళికి
న్ననిశము తీర్థసాదములు హర్షతతోడ నొసంగునట్లు గా
తన పరిచారికాతతికి తాల్మితొ కట్టడిసేయ వారలుఁ.

క. అనుదినము యుత్తిరుంగున
వనజాక్షివి సన్నిధిఁ న్నవారక నిలిచిఁ

ఘనతర దివ్యోత్సవ మిటు
కనుగొనుచు న్నుండి రధికకౌతూహలతన్.

వ. ఇట్లత్యంతాతిశయంబున నమ్మహోత్సవ మవభృథాంత పర్యంతంబు నుగా నిలిచి యనంతరంబున నమ్మహామహుంచే నాజ్ఞఁగైకొని మగిడి కతిపయగతులన్ సపరివారంబుగా భట్టనాథుండు ధన్వినామపుటభేద నంబునకు పుత్రికాసమేతంబుగాజనుదెంచి సుసౌఖ్యముగా నిజాలయం బుననుండెనని రామానుజార్యుం డఖిలదేశికవ్రాతంబులకు నానతిచ్చిన నత్యంతాతిశయాద్భుత మానసులై యవ్వలికథాశ్రవణకుతూహలులై యడిగిరనుటయు.

శరధివిహార ధీర సురశాత్రవశాత్రవ దీనపోషణా
కరిరిపుజైత్రజైత్ర శిరఖండనమండిత చక్రధారణా
నరహరిరూప దైత్యహర నాగసుభూషణ చిత్తరంజనా
ధరధరహస్తగోత్ర రిపుదండనమండిత చండవిక్రమా.

కమలాక్ష! కమలవక్షా!
కమలాప్త సహస్రతేజ! కాంతికలాపా!
కమలారివంశదీపా!
కమలాప్తకుమారజైత్ర! కామితఫలదా!

శ్రీరమా యను వృత్తము:

శతమఘమణినిభ చారుశరీరా!
క్రతుభుజరిపుశిరఖండన శౌర్యా!
రతిపతివిదళిత రంజితచిత్తా!
దితిసుతమదహర దీపితతేజా!

గ. ఇతి శ్రీమద్వేంకటలక్ష్మీనృసింహ వరప్రసాదలబ్ధ గీర్వాణాంధ్రోభయ భాషాకవితావిచిత్ర విదేహరాజకన్యకాభ్యుదయాది షోడశమహాగ్రంథ బంధురాలంకార నిర్మాణపారీణ ఘనయశోబంధుర మౌద్గల్యమహాఋషిగోత్రపవిత్ర వేంకటదేశికపౌత్ర కుమారవేంకటాచార్యపుత్ర మరింగంటి వేంకటనృసింహాచార్యవిరచితంబైన గోదావధూటీ పరిణయంబను శృంగారప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము భాసిల్లును

ఓం

# శ్రీ గోదావధూటీ పరిణయము

## తృతీయాశ్వాసము

సిరిహృదయకుముద హిమకర
సరసిజభవవాసవాది సన్నుతచరణా
సిరసనగండ్లమహీధర
స్థిరతర శ్రీనారసింహ శ్రితశుభరంహా.

గీ. చిత్తగింపుము యతిరాజశేఖరుండు
అఖిల చేతన తతులకు నతిశయముగ
వసుమతీసతియగు గోద వైభవంబు
స్వాంతమలరంగ వినిపించె సమ్ముదమున.

క. రంగపతియాజ్ఞఁ జోకుఁడు
పొంగుచు నటు వేగ పాండ్య భూవరుకడకుఁ
సంగతిగా శుభలేఖలు
మంగళకరముగనువ్రాసి మటి పంపించెఁ.

ఉ. చారులు సంతసంబునను చక్కఁగ నా మధురాపురంబుకుం
బారఁగవచ్చి పాండ్యనృపు స్వాంతము రంజిల లేఖ లిచ్చినఁ
కూరిమితోడఁ గైకొనియు గొబ్బునఁ గన్గొని యుత్సహింపుచుఁ.
వారలమేనిసేదటు నివారణయయ్యెడు నట్లు చేసియుఁ.

ఉ. ఇంతకుమించు కార్య మిక యెయ్యది ధన్యుడనైతి నంచు దా
సంతస మంది పాండ్యనృప సత్తము డాప్త సుహృజ్జనాళితో
నంతిపురంబు వెల్వడియు నార్తితొ ధన్విపురంబుకేగి సు
స్వాంతత భట్టనాథు గని సాగిలిమ్రొక్కి కరంబు లొగ్గియున్.

ఉ. మీ మహనీయ వైభవము మిమ్ము కృతార్థులఁ జేయునట్లగన్
శ్రీమహిళామనోహరుఁడు చిత్తమునందు దలంచి నేడిటుల్
ప్రేమను మీ కుమారితను పెండిలి తా మొనరించువారలై
స్తోమముతోడ వత్తురని చోళనృపాలుఁడు లేఖలంపె దాన్.

చ. అన విని విష్ణుచిత్తు లెద హర్షము నొందుచు పాండ్యభూవరున్
కనుఁగొని యిట్టి కైంకరియ కట్టడి మీకొనఁగూడి వచ్చుటల్
ఘనతరమైన సద్యశము గంహరియందున గల్గుఁ గావునన్
మనమున సంశయింపకను మానవనాథ యొనర్పు శీఘ్రమే.

గీ. అనుచు నియమింప నానృపుఁ డరుసమంది
తనదు మంత్రుల దెసఁగాంచి ఘనతరముగ
మనపురంబునగల యట్టి యనుజులెల్ల
వినఁగ సాటింపుఁ డన వారు వేగమపుడు.

చ. ఉరువగు భద్రసింధురము నొప్పినభేరియు సంఘటించియా
పురవరవీథులందులను బోరుకొనంగను చారు లుద్ధతిన్
సరసముగాఁగ సాటిరటు సర్వజనంబులు నాలకించఁగాన్
మురిపెము నొందఁజేసి రటు మోదమునన్ గృహసీమ లింపుగాన్.

చ. విరతము విందిరాధవుకు నెయ్యమెలర్ప సపర్యఁ జేయు నా
పురవరమందులన్ వెలయు భూసురులాదిగ నాల్గుజాతులు

న్నుఅమఅలేవి భ్రాంతి యెదయరిదు బెనంగొన సత్క్రమంబుగ
న్నరపతియాజ్ఞఁ జేసిరటు నమ్రతగాగ శుభోచితక్రియన్.

ఉ. అంతి పురాంగణంబులును హర్మ్యచయంబులు రాజవీథులున్
వింతగు కొల్వుసద్మములు వెల్వలనుండెడు చిత్రశాలలున్
సంతసమందుచు న్నగరి సర్వజనంబుల స్వీయగేహముల్
అంతట సత్వరంబుగను నాతురతంబొనరించి రిట్లుగన్.

సీ. పరిశుద్ధముగలెస్స భవనముల్ శోధించి
చల్లగా పన్నీరుఁ జల్లువారు
మృగమద కాశ్మీర యగరుమలయజగంధ
మలవడ ముంగిళు లలుకువారు
కనకరంభా స్తంభకములు చక్కగ నిల్పి
చప్పరంబులు గట్ట సాగువారు
నాణిముత్యపుసరు లతిరమ్యకరముగా
కడువేడ్కఁ జాలరుల్ గట్టువారు

గీ. దివ్యముగ రంగవల్లులుఁ దీర్చువారు
అగరు దూపంబులిడువారు నగరులందు
శుభకరంబగు చిత్రముల్ సుస్థిరముగ
చిత్తమలరంగ నేర్పొద్దు సేయువారు.

కం. క్షితిపతి యనుమతి నప్పురి
సతివలు, పురుషులును చాల ననురాగమునన్
హితమతి తమతమ కుశలత
లతులితముగ చిత్రరచన లటులొనరించన్.

గీ. ఎల్లచో రాగి మామిడి పల్లవముల
గురుతరంబగు తోరణాల్ గూర్చి సకల
సదన సద్వారములపైన సమ్మదమున
కరము దీపింపఁగట్టిరి ఘనతరముగ.

గీ. కనక రజిత ఖచిత ఘనరత్నభూషణాల్
సురుచిరాంబరములు శుభకరముగ
వీరు వారు నన కవిరళంబుగా లెస్స
యఖిల జనులు దాల్చి రతిశయముగ

కం. న్యగ్రోధ పర్ణశయునని
యుగ్రాణములందు నిండ నుర్వీశాజ్ఞన్
వ్యగ్రత సేయ కమాత్యు లు
దగ్రత ధనధాన్యములను తడయక నించన్.

ఉ. అంతకుమున్నె పాండ్యుడట హర్షముతోడుత చోళ పాలికిన్
సంతస చిత్తుడౌచు కడు సత్వరతన్ శుభలేఖ లంప వా
రంత ముదంబునొందుచును నబ్జదళాక్షుకు సక్రమంబుగా
నింతు లొగి న్నివాళులిడి నింపుగపెండ్లికుమారుఁ జేయగన్.

వ. అంత యన్నగరస్థితాశేష స్త్రీపురుషసందోహంబు లత్యంతాదరంబున పురాలంకారంబుఁ గావించి సుస్నాతులై కనకాంబరాభరణాద్యలంకృతులై యుండునెడ హరిహయ హర విరించ్యాది త్రిదశత్రికోటి దేవతానిచయంబులును విష్వక్సేనాది నిత్యసూరినివహంబులును ఆర్యా స్వరూపులై యమరాగంబున శ్రీభూనీళాది సీమంతినీనివహంబులు చామరగ్రాహిణ్యాది చేటికాజనంబులుఁ గొలువ మణిమయాలంకృతంబైన యందలంబున నిరుగెలంకుల నృదుగుదేర శ్రీరంగేశ్వరున్

విహంగపుంగవారోహణంబు గావించుకొని చోళేంద్రాది భూపాల నికరంబులు ద్విరదరథాశ్వపదాతివర్గంబులు నిరువంకలం గొలచిరా కళ్యాణోచిత కరణీయంబులగు శంఖ భేరీ మృదంగ పటహ నిస్సాణ కాహళాది ద్వాత్రింశద్వాద్యతూర్యంబులు చెలంగ కవి గాయక సూత వందిమాగధ నికరంబులు కరంబెత్తి కైవారంబులు సేయ నటద్గజ గామినీనికరంబులు సన్ముఖంబునఁ నృత్యగీతవాద్యంబు లొనరింప గనుంగొనుచు సపరివారంబుగా నన్నగరంబు నిర్గమించి కతిపయ ప్రయాణంబుల ధన్వినామపుటభేదనంబుఁ చేరంజని యన్నగరోపరి భాగంబునం గల కుంద మాకంద ఖర్జూర జంబు జంబీర కాంచన మరువక కుడవక లుంగ లవంగ మాతులుం గైలా కుడుంగ కపిత్థ కరవీర వకుళ వంజుళ క్రముక నారికేళ కేసర కదళీ కదంబ మందార సిందువార పాటలి పారిభద్రాది నానాద్రుమ విరాజితోద్యానంబులఁ నిలచి తమ రాక చారులచేత సుముహూర్తపత్త్రికలం బనిచిన వారల యరసి హర్షించి యత్యంత ప్రమోదాయత్తచిత్తులై యతిత్వరితం బుగా కనకమణిఖచిత పళ్లెరంబులఁ కస్తూరికాగుర్వార్ద్రకాశ్మీరఘన సారమలయజకలితకరోరంబులు విడుకొని పరమవైదిక భాగవత సువాసినీ సందోహంబులు కరంబులఁ గయికొనిరాగ మణిమయాం బరాభరణ శోభనద్రవ్యంబులు కొందరు గైకొని చనుదేర మంగళ తూర్యాది బహువిధ వాద్యంబులుఁ చెలంగ కార్తస్వర మణి ఘటిత దోలికలు పయింగల భద్రదంతావళంబు నడుమ వటపత్రశయనునిఁ సకలమణిఖచిత భూషణ వసనాద్యలంకృతుఁ గావించుకొని శ్రీ విష్ణుచిత్తా ద్యనేక భాగవతసమూహంబులు స్వస్తివాచనంబులు జెప్పు చుఁ జనుదేర పాండ్యమహీవల్లభుండు పుత్రమిత్రకళత్రసచివసా మంతభృత్యాది సుహృజ్జనసమేతంబుగా కరదీపికాసహస్రంబులతో నెదుర్కొన నరుదెంచునప్పుడు.

చ. పరిణవయస్కులౌచు నటు పాండ్యమహీపతి చోళభూవరుల్
అరమరలేని భ్రాంతి యెదయందు బెనంగొన సంతసంబున
న్నిరువురు వియ్యపుంవరుస నెన్నుచును న్నుపగూహనంబులన్
సరసముగా నొనర్చి సుమసౌరభ పుష్పాది గుప్పులాడుచున్.

కం. వరపూజార్థముగాగను
సురుచిరకనకాంబరాది శుభద్రవ్యములన్
సరసముగ పెండ్లికొమరుని
ధరియింపఁగజేసి రిట్లు ధరణీజనులున్.

మ. ఇరువా రచ్చటనుండియున్ కదులుచో నిష్టానులాపంబులున్
కరమొప్ప న్నొనరింపుచు న్నగరికిన్ కౌతూహలోపేతులై
యరుదేరం గని పౌరకామినులటుల్ హర్మ్యాగ్రభాగంబులన్
పరవి న్నిల్చి ప్రసూనజాలములనున్ సౌహార్ద్రతన్ జల్లగన్.

వ. ఇ ట్లఖిలజనసందోహంబులతో ననేకకక్ష్యాంతరబులున్ గడఁచి కన
త్కనకమణిమయాలంకృతంబై విలసిల్లు వటపత్రశయను నిజనికేత
నంబు శ్రీరంగధామునకున్ విడిదిగా నిలువ న్నియమించి తక్కిన
జనంబులకు తగిన విడుదుల నగరమందిరాంగణంబుల యుద్యాన
వాటికలం గల పటకుటీరంబుల విడియ నియమించి వారలకుం
దగినట్టి షడ్రసోపేతంబుగా భుజియించునట్లు యథావిధిగా సకల
ద్రవ్యములు వనగూర్చి యద్ధరణీధవుం డపుడు.

ఉ. భావుకవాద్యముల్ చలఁగ భట్టగురోత్తము రాణి వేగ మున్
కోవిదముఖ్యసంఘములఁ గూర్చుక స్నాతక వస్తువుల్ గొనిన్
నావతొ పెండ్లివారికిని నర్పణఁజేసిన వార లప్పుడున్
భావమునన్ తెలంగి కడు భాసురతన్ న్నిటుజేసి రింపుగాన్.

ఉ. వైదికకర్మ మిట్లు ననుపందయొనర్చి యనంతరంబునఁ
మోదముతోడ భోజనము ముఖ్యకరంబగు బంధుకోటితో
నాదరమొప్ప జేసి రతిహర్షముతో నిరువార లంతటఁ
పోదిగనిల్చి నుద్వహపు పొల్పగునట్టి పనుల్ యొనర్పఁగాఁ.

ఉ. అంతట పశ్చిమాంబునిధి కవ్వలనుండు మహీధరంబుకుఁ
సంతసమొప్ప నేగి తన సాధ్వితొ కస్తురిరంగ డిద్ధరా
కాంత నిజాంశరూపమునఁ గల్గిన గోద యనే సుకన్యకఁ
భ్రాంతితొ నుద్వహంబునగు భామిని కిప్పుడటంచు తెల్పునఁ.

గీ. అతిరయంబున యిను డిట్లు నస్తశిఖరి
కడకు జనుదేరు టరసి తా క్ష్మాతలంబు
నతులితంబైన యామిని యనెడు కాంత
దశదిశలయందు గ్రమ్మెను దట్టముగను.

వ. అయ్యవసరంబున.

క. మధు డలరి విటవిటావలి
సురతసుఖానందములను సౌఖ్యఁగజేయఁ
తరి యిదియెయౌ నటంచును
పురిఁగొలిపెడుమాడ్కి బరపె పూబాణములఁ.

వ. అప్పుడు.

సీ. దిమ్మరై యిల్లిల్లు తిరుగుచుండెడు లేమ
వరుని వంకలుబెట్టు వన్నెలాడి
అతిషండుఁడగునట్టి అవగుణు నిల్లాలు
శివసత్తి వావులఁ దివిరిబోతు

వయసునందునె పుష్పవతిగాని కాంతయు
　　కల్యాణమేకాని కన్యపడుచు
వశ్వంతవేషత వ్యభిచారియగు యింతి
　　సురవిక్రయముఁజేయు సుందరాంగి
గీ. బుద్ధిహీనుండు నగునట్టి వృద్ధభార్య
విరుల నేప్రొద్దు నమ్మెడు విద్రుమోష్ఠి
వీరలందరు యామినీ వేళలందు
వేడ్కఁకింపైన విటులను వెదకికొనుచు.

చ. మరుగగు కేళిసద్మముల మంజులమౌ మృదుశయ్యలందునన్
వరవగు ధౌతచేలముల వన్నెలఁగన్గొను మెర్గుటద్దముల్
పరసనుగంధకల్పముల సౌరభసంయుత తాంబులంబుల
న్నిరువుర కిచ్చలేక నతియేహ్యతకున్ వడబాటు యయ్యటున్.

ఉ. కుంటెనకత్తె ముంగిళుల గోష్ఠచయంబుల పాదుగుళ్ళనున్
కంటకకీర్ణమై నెగడు గచ్చపొదల్ గల కందకంబులన్
పెంటలదిబ్బపందులను భీతివి నిర్వురుగూడి కూటముల్
దంటగ తుంటవింటిదొర దారుణకయ్య మొనర్ప నయ్యెడున్.

ఉ. చీకటిపాలెగాడు యిటు శేముషియందున చిమ్మరేగి య
స్తోకతతోడ మార్గముల తొల్గకనిల్చియు నుండుకై వడిన్
లోకములోపనుం జనులు లోగి చరించక యానిశీధినిన్
ప్రాకటమొప్ప గేహముల బాయక మందురు దంటఁగూడుకన్.

ఉ. అంత సుధాకరుండు మదియందున యామినికాంత చేష్టితం
బంతయు దా నెరింగి యది యెట్టిదొ కన్గొని రమ్మటంచు యే

కాంతము దెల్ప తారకలు గ్రక్కున యామిని జాడ జూడగన్
వింతగ నంతరిక్షమున వేడ్కతో గన్పడి రంతటంతటన్.

ఉ. జారుల గుండియల్ నవయ సారసజైత్రుడు ప్రాగ్దిశందునన్
చారుతరైకజ్యోత్స్నతలు చక్కగ భూనభమందు బర్వ యిం
పారగ వేగ ముందటను పొల్పడి గంధవహుండు తూగిరా
మారుడు తా స్వసైన్యతతిమండలియు న్నిరువంక గొల్వగాన్.

సీ. సప్తవింశతి వృక్షసమితితో ద్విజరాజు
నరుదేర యామినీతరుణి గాంచి
వ్రీడాభరంబును గాఢమై యెద బెగ్గ
చిఱునవ్వు మొగమున శిరమువంచి
కాంతల కైశిక కజ్జలంబందుల
దాగి యంతట నిల్వ ధైర్యమెడల
గచ్చుమిద్దెలలోన జొచ్చి మూలల దాగి
నచట వెళ్లెడి దివ్వెలరసి తొలగి
గీ. కానలకు నేగి యట యిమ్ము గనక వేగ
కొండలోయల గుహలందు నిండుకొనియు
యుండు జాడయు దెలిసిన యుర్వియందు
వెదక జొచ్చెను కౌముది వెంటనంటి.

వ. ఇట్లఖర్వాఖర్వానంతతేజోవిరాజమానుండగు సుధాకరుండు వియ
న్మండలమధ్యవర్తియై విజృంభించుచుండు నయ్యెడ నక్షాసనానుమతం
బున అరుంధతీరమణుండు హరిసన్నిధానంబున కరుదెంచి లగ్నం
బతిసాన్నిధ్యంబై వచ్చుచున్నయది గావున కాలయాపనంబుసేయక
వైవాహికసదనంబునకు విచ్చేయవలయు నని విన్నవించిన విని

విష్వక్సేనాది నిత్యసూరినివహంబులును శ్రీపరాంకుశ పరకాల కుల శేఖరాది మహాదేశికవ్రాతంబులును చోళభూపాలాది తదీయచేతన సందోహంబు లత్యంతాతిశయంబున సపరివారంబుతో శంఖకాహళ భేరీమృదంగవేణువీణాది మంగళతూర్యారవంబులు చెలంగ నిరుగెలం కులఁ గరదీపికాసహస్రంబులుఁ వెలుంగ కవిగాయకసూతమాగధ వందివైతాళికనటనారీసముదయంబులు తమతమ విద్యాప్రౌఢిమంబుల న్మెరయ ఉభయమధ్యస్థితంబుగా జనుఁదేర కేవలచరరూపధారుండగు శ్రీరంగధాముని వైనతేయస్కంధారూఢుం గావించుకొని యిరుగెలం కుల శితచ్ఛత్రచామరములును ఆలవట్టమును ధ్వజపతాకంబులు కరం బులఁ ధరియించి కైవారంబుసేయుచు జనుదేర నత్యంతవైభవం బుగా యమ్మహామహు సన్ముఖంబునకు పాండ్యభూపాలాది రాజ సమూహంబులు శ్రీవిష్ణుచిత్తుఁ బురస్కరించుకొని అనేకభాగవత చయంబులు వధూవరసమేతంబుగా ద్వాత్రింశద్వాద్యంబులుఁ మొరయ యెదుర్కొని కనకాంబరంబుల పెండ్లికొమారు నలంకరించి ఘనసారకాశ్మీరకస్తూరి కాగరుచందన పరిమళసుగంధపు పుప్పొడుల యిరువాగులవారు గుప్పులాడుచు కలసి రథ్యాన్తరంబులఁ గడచి వైవాహికసదనద్వారంబున వాహనంబులడిగ్గి కర్పూరనీరాజననివా ళులు పుణ్యాంగనలొసంగ కక్ష్యాంతరంబులు గడచి కళ్యాణమంటపం బునకుం జని శ్రీరంగధాముని కనకాసనాసీనుం గావించి యుభయ పార్శ్వంబుల నుచితాస్తరణంబుల నాశీనులై యుండు నయ్యెడ.

ఉ. అంతకుమున్నె యంతిపురమందున ధాత్రిసురాంగనామణుల్
భ్రాంతితొ విష్ణుచిత్తముని పట్టిని పెండ్లికుమార్తెసేయఁగన్
స్వాంతము రంజి లందరును చక్కఁగ వేగ నివాళులిచ్చి య
త్యంతపుమోదముఁ శిరసు నందుల సంపెగతైల మంటియుఁ.

సీ. అమలపిష్టంబు నగరుగంధపు పంక
జంబీరరసముతో చక్కఁగాను
మైరాసి పన్నీట మజ్జనం బొనరించి
ధవళాంబరంబుచే తడియునొత్తి
కరనఖంబుల కురుల్ కైసేసిదువ్వియు
జారెడు శిగవైచి సమ్మదమున
విరజాజిసంపెంగ విరిసరుల్ జుట్టియు
కాశ్మీరతిలకంబు ఘనతరముగ
గీ. నిటలతటమున ఘటియించి నేర్పెలర్ప
ధర్మచేలంబు చింగులుజార కటిని
సొంపుమీరంగగట్టియు సురుచిరముగ
నవ్యమణిభూషణాదుల నమరఁజేసి.

చ. అతివలు యిత్తెరుంగునను హర్షత గోదవధూలలామకున్.
చతురతతో నలంకృతులు చిత్తము రంజిలఁజేసి గ్రక్కునన్
హితమతితోడఁ దోడ్కొనియు నిందిరవల్లభు సమ్ముఖంబునన్
కుతుకమెలర్పఁగా నిలిపి గొబ్బుననున్ దెరబట్టి రప్పుడున్.

చ. అలరుచు విష్ణుచిత్తు డతిహర్షత యంగన సంయుతంబుగా
పొలుపుగ నేగుదెంచి యటు భూసురసంఘము లెచ్చరించఁగా
జలజదళాక్షు యంఘ్రులను జానువ పళ్లెరమందు జేర్చియున్
మలయజగంధతోయమును మానినియుంచఁగ నక్రమంబుగన్.

ఉ. మంగళతూర్యముల్ చెలఁగ మంత్రయుతంబుగ శ్రీశు నంఘ్రులు
న్నంగనసంయుతుం డగుచు హర్షముతోడను గద్దె రంతటన్
బంగరురంగెసంగు మధుపర్కయుగంబు లొసంగి పేర్మితో
హంగగు రత్నభూషణము లర్పణఁజేసెను పేర్మిసంధిలన్.

వ. అప్పుడు.

క. లీలకరగుడము ముస్నుగ
బాలామణిచేత రంగపతి శీర్షమునన్
వాలాయంబుగ నిడఁగను
హేలావతులైన ప్రౌఢ లింతులు నపుడున్.

క. గావింప సకలజనములు
భావంబున సంతసించి బహువిధగతులన్
నావరవర్ణులఁ గనుఁగొని
గావించిరి ప్రస్తుతులను కౌతూహలతన్.

ఉ. అంత నరుంధతీప్రియుడు హర్షత మంగళసూత్రయుగ్మమున్
సంతసమంద తత్పుభికసంఘమువైపు నొసంగ వారలున్
స్వాంతమునందు నుబ్బుచును చక్కఁగ కన్నులనద్దుక న్వెసన్
కాంతునికై కొసంగగను గట్టెను యాసతి కంధరంబునన్.

చ. ఉరివిసురాంగనల్ మదిలొ నుబ్బుచు బంగరుపళ్ళెరంబులన్
వరపగు మౌక్తికాక్షతలు వావిరిగా యటనుంచుకన్ వెసన్
వరుడు వధూమణిం గలసి వాపిగనిల్చిన గాంచి నవ్వుచున్
సిరి భువి నీళ గోదపతి చిత్తమురంజిల రంగనాథునిన్,

చ. వలగొని పల్వురు న్నిలవ వారిపయిన్ శుభమౌక్తికాక్షతల్
పొలుపుగ దోయిటన్ గొనియు భూసురముఖ్యులు సొంపెలర్పఁగ
విలి చటు మంగలాష్టకము నెయ్యమువందిల నుచ్చరింపఁగన్
న్నలరుచు శ్రీశుమూర్ధ్నమున హర్షతతో తలబ్రాలుబోయఁగాన్.

గీ. అమ్మహోత్సవంబు నరసి సుపర్వులు
సమ్మదంబు లెదలొ సందడింప
కల్పప్రసునవవృష్టి కడు చిత్రకరముగా
గురియఁజేసి రపుడు కోర్కెలలర.

ఉ. అంత ధరాసురాంగనలు నట్టివధూవర వస్త్రయుగ్మముఁ
వింతగ బ్రహ్మబంధనము వేసియు వేదికపై వసింపగా
నంత యరుంధతీరమణు డార్యహితంబుగ హోమకృత్యముల్
స్వాంతమురంజిలఁ జరిపె చక్కగనుఁ నిగమోక్తపద్ధతిఁ.

వ. ఇట్లు నిగమోక్త పద్ధతిఁ జరిపిన యనంతరంబ.

కం. ధారుణీసురలును బుధులును
వారక నాశీర్వదించ వారలకెల్లఁ
కోరిన యర్థము లెల్లను
ధీరత శ్రీవిష్ణుచిత్తదేశికుఁ డొసఁగెఁ.

వ. అంత బ్రద్యోతోదయకాలంబు యగుటనరసి స్థితాశేషవిద్వన్మహాజనంబులు ప్రత్యూషకాలోచితకృత్యంబులు సత్క్రమంబుగా గావించి, ధౌతాంబరాభరణభూషితులై కల్యాణమందిరంబున కరుదెంచిన వారలకు విష్ణుచిత్తుండు భగవన్నివేదితంబైన షడ్రససంయుతంబగు నవవిధభక్ష్య చతుర్విధాదివోదనంబులు ఆజ్యాదిదధ్యాంతంబుగా పరితృప్తులంగావించి చందనకుసుమతాంబూలంబు లర్పించిన పరమానంద భరితులై పంచాహ్నికంబులలో గల వైదికలౌకికాదికృత్యంబులు సలక్షణంబుగా గావింపుచు సరససల్లాపోచితసద్గోష్ఠులఁ యహరహంబు లత్యంతాతిశయంబున షోడశవారంబులు సుస్థిరంబుగా నిల్పి యనంతరంబ వటపత్రశయనుచే నామంత్రితులై

గరుడకేతనాలంకృతంబైన దివ్యవిమానంబున శ్రీ భూనీళా గోదావధూసీమంతినీసంయుతుండగు శ్రీరంగధాముని వెంచేపుఁజేసుకొని విష్ణుచిత్తాది శ్రీమహాభాగవతనివహంబులు కుటుంబినీసంయుతంబుగా రథాశ్వాందోళికారోహణులై వెనువెంటం జనుదేర పాండ్య, చోళ, మళయాళ, తుండీర, మహీమండలాధ్యక్షులగు నృపాలసముఖంబులు రథ గజాశ్వాధిరూఢులై సపరివారంబులతో శంఖ, కాహళ, భేరీ మృదంగ, మురజ, ఢక్కానకాది మంగళతూర్యరావంబులు మొరయ ధన్వినామనగరంబు నిర్గమించి కతిపయగతులఁ అనేకనదీనగకాంతారంబులఁ గడచి ఉభయకావేరీమధ్యస్థితంబగు శ్రీరంగనామపుటభేదనోద్యానంబున కరుగుదెంచి తమరాక యన్నగరస్థితాశేషజనంబులకుఁ దెలియఁ వారలఁ బనిచిన వార లతిత్వరితంబుగా జని విన్నవించిన వార లపుడు.

ఉ. పట్టపుదంతి మూపుపయి బంధురమౌ జయభేరిఁ జేర్చుకఁ
పట్టణవీధులంతటను ప్రస్ఫుటనాదము నివ్వటిల్లఁగఁ
దిట్టముగాగఁ జాటి రటు తెల్పెదునట్టుల చారు లుద్ధతిఁ
ఘట్టిగ రండి లెండి రతికాంతునితండ్రి నెదుర్కొనంగనుఁ.

ఉ. వచ్చిరి పెండ్లివారు సతివైభవతఁ హరిచిత్తు పుత్త్రితో
వచ్చిరి పాండ్యచోళనృపవర్యులు గొల్వఁగ రంగభర్త దా
వచ్చెను ధన్వినామపురివాసులునైన తదీయవ్రాతముల్
వచ్చిరి చూడఁబోవుదము వైళమరమ్మని జేరఁబిల్వఁగఁ.

చ. వివి మది సంతసింపుచును వేగమె తా నిజమందిరంబులఁ
ఘనమృదుగంధతోయముల కల్పదముఁ వెసఁ జల్లి చక్కఁగఁ
పనిఁబడి ప్రౌఢకామినులు బంధురమౌ త్త్రికరంగవల్లులు
న్ననువుగఁదీర్చి కామిను లలంకృతులై రిటుఁ జూచు వేడుకఁ.

చ. కనకవినూత్నరత్నమయకల్పితమై పొలుపొందు కట్నముల్
మన మలరంగ గైకొని యమాత్యులు భృత్యులు భూవరేణ్యులున్.
గన నెదురేగి రందరును కాంతునితండ్రిని గాంచి మ్రొక్కిదన్
వినయముతో నొసంగగను వేడ్కయు సంధిల గైగొనిన్ వెసన్.

చ. అమితప్రమోదతన్ హరియు నందజరాజవిమానరూఢుఁడై
రమణులునల్వు రంత యనురాగముతో నిరుపార్శ్వమందునన్
గుమిగొని చేటికౌఘములు కూర్మితొ మున్ వెనువెంటనంటిరా
తమతమ వాహనంబులు నుదారత నెక్కిరి యంద రప్పుడున్.

ఉ. మంగళతూర్యరావము లమందగతిన్ జలగంగ నాట్యముల్
అంగన లింపొసంగగను నాడగ సత్కవివందిమాగధుల్
పొంగుచు సన్ముఖంబునను పొల్పుగ హెచ్చరికల్ యొనర్పఁగన్
రంగవిభుండు వచ్చె కపురాజసమున్ దళుకొత్త పీటికిన్.

సీ. పవనసన్మణిఘృణుల్ దనరు దామోదర
గోపురద్వారంబు కోర్కెలలర
జొచ్చి తా మటుఁ దాటి సురుచిరంబగునట్టి
సప్తవప్రంబులు సరభసముగ
గడచి కక్ష్యావళుల్ గనుచు ఠీవితొ రాగ
పౌరాంగనామణుల్ భాసురముగ
కర్పూరహారతుల్ కదళి నెడనెడ నివ్వ
మరికొంద రంగనల్ మక్కువతోను

గీ. కుందకోరకలక్షతల్ గుప్పఁగాను
అంతిపురమధ్యమున కేగి సంతసమున
గోదసతి కేలుఁబట్టుక కుసుమశరుని
జనకుడగునట్టి శ్రీరంగశాయి యపుడు.

శా. అంత న్నంతిపురాంగనామణులు దాహర్షస్థితిన్ గూడుకన్
స్వాంతంబందుల సంతసంబలరఁగా సౌహార్ద్రశ్రితంజేరి శ్రీ
కాంతున్ "కన్నుల లేమిఁదీర గనుచున్" కౌతూహలోపేతులై
భ్రాంతిన్ దోయిడ సుప్రసూనపుసరుల్ బాగొప్పఁగన్ గుప్పఁగన్.

చ. సిరి భువి నీళ లంతటను చిత్తమురంజిల పెండ్లికూతురిన్
హరి నటు భద్రపీఠికను నందునఁ జక్కఁగ నిల్వఁజేసియున్
వరపగు మౌక్తికాక్షతలు వందగ మూర్ధములందు నిండగ
న్నరుదగు ధర్మవస్త్రము నందుననున్ "వడిబాలు" చక్కఁగాన్.

చ. పదిలముగాగ పళ్లెమున భామినులు న్నిదఁజేసి యంతటన్
ముదితతొగూడి యందరును ముచ్చటలాడుచు సుస్థిరంబుగన్
విదితముగాగ నవ్యమణివేదికయంధున నుందునంత నా
సదయత రంగనాథుడు హజారముకేగియు చోళభూవరున్.

చ. అరసియు వీరలందరికి నర్హములైన గృహంబులెల్ల తా
నరగునఁగాంచి యందులను చక్కగనున్ విడియించుమంచునున్
శిరివరు డానతిచ్చినను శేముషిరంజిలి నాతఁ డట్లగన్
కరనుదలిర్ప నందరను గ్రక్కుననున్ విడియించి వారికిన్.

గీ. సకలభక్ష్యభోజ్యషడ్రసోపేతమౌ
రసరపాన్నములను రమణు లిడఁగ
కరమెలర్పఁగాను కట్టడిఁజేసిన
ముదముతోడ భోజ్యములు నొసంగి.

క. చందనకుసుమము లమలము
లందరికి న్నొసఁగ చాల యమలాగమునన్

నందకధరు నివ్విభవము
పొందుగ గొనియాడుచుండ్రి పొల్పుదలిర్పన్.

వ. ఇవ్విధంబున శ్రీవిష్ణుచిత్తాది శ్రీమహాభాగవతదేశికవ్రాతంబును చోళ పాండ్య మహీమండలాధ్యక్షులగు నృపాలసంఘంబులును నన్నగర స్థితాశేష చేతననరనారీవ్రాతంబులును అంగరంగాది వైభవంబుల ననవరత అహర్నిశంబు లత్యంతసౌఖ్యాతిశయంబుల సేవింపుచుండు నయ్యెడ శ్రీ భూ నీళాదిదివ్యమహిషీనివహంబులు చామరగ్రాహిణీ సుమగ్రహాది చేటికానివహంబులతోఁ గూడి యవ్వధూవరులకు ఏకాంతోత్సవంబు గావింపం దలంచి తిథి, వార, నక్షత్ర, యోగ, కరణానుకూలంబగు నొక్క శుభవాసరంబున రవిశశిమణిఘటితమంటపంబున పరిమృదితసుప్రసువచూతాశ్వత్థపల్లవంబులుంగూర్చి తోరణంబులుం గట్టించి బహువిధమంగళతూర్యనాదంబులుం జెలంగ నాదంపతుల కనకమణిమయఘటిత పీఠంబుల గూర్చుండంజేసి, కుంద కుసుమాక్షతల సేసలిడి, కర్పూరనీరాంజనంబుల నివ్వాళులొసంగి, సంపెంగ తైలంబుల నభ్యంగనంబొనర్చి, ఆర్ద్రాగరుకాశ్మీరరజంబుల నల్గులిడి ఆమలక జంబీరఫల రసకర్దమంబులన్ బ్రామి కనక కలశంబులం గల గొజ్జంగి పన్నీట మజ్జనంబొనర్చి ధౌతచేలంబులఁ దడియు నడలించి నవీనశృంగారంబు లొనరింపందలంచి వెండియు.

సీ. పేర్మితో ముక్కాలిపీట యొక్కతె బెట్టె
చెలువను గూర్చుండఁజేసె నొకతె
చికురముల్ కొనగోర చిక్కుఁదీసె నొకర్తె
నగరుధూపములిడె నబల యొకతె
ఘంచుటద్దము నెదుట నుంచె నొకర్తెయు
జారుకైసిగనిడె జాణ యొకతె

తిలకంబు నుదుటిపై దీర్చె నొక్కొ-మ్మయు
నగరుచందన మలదె నతివ యొకతె
గీ. కనకచేలంబు గట్టించె కాంత యొకతె
రతనముల కంచుకముఁదొడ్గి రమణి యొకతె
సవ్యభూషణములజేర్చె నారియొకతె
శిరియు, భువి, నీళ లనుమతి చేదె లిట్లు.

మ. హరిచిత్తాత్మజ నిత్తెరంగున సతుల్ నారీతి మోదంబుతో
వరపౌ సన్మణిభూషణాంబరములన్ పర్యాయముల్ సంధిలన్
సరసంబైన యలంకృతుల్ సహజులున్ సౌహార్ద్రరీతిన్ జేసి శ్రీ
హరిచెంతన్ పరమార్తితన్ నిలిపిరి న్నార్యుల్ మదిన్ మెచ్చఁగాన్.

ఉ. అంతట యమ్మహామహులు హర్షత వైదికలౌకికక్రియల్
స్వాంతమురంజిలన్ జరిపి సర్వసుహృజ్జనసంయుతంబుగా
వింతగ భక్ష్యభోజ్యములు పేర్కొ-దలిర్ప యొసర్చి లెస్సగన్
సంతస మందుచుండుతరి సత్వర భానుఁడు గ్రుంకె నయ్యెడన్.

చ. తిమిరముగప్పె నద్దిశల దివ్యతరంబుగ మింటతారకా
సముదయమయ్యెను స్మలయజానిలు డల్లనవీచె నయ్యెడన్
హిమకరు పూర్వదిక్తటము నేగగదోచెను జ్యోత్స్న యంతటన్
ప్రమదజనౌఘముల్ మిగుల భాసురమై విలసిల్లె నుర్వరన్.

వ. అంత నాశుభవాసరనిశీధి ప్రథమయామావశిష్ట కాలంబున.

క. ఉత్తమవ్రతులగు స్వత్కు-ల
ముత్తైదువ లెల్లఁగూడి ముద మెద నొదవన్
పొత్తుల దంపతు లిర్వుర
హత్తుగ భుజియింపఁజేసి రనురాగమునన్.

క. వధువరులచేత నప్పుడు
బుధజను లనురాగమునను పొలుపొందుగనుꣳ
మిథునవిడెంబులు నందుక
ప్రథమసమాగమము కాజ్ఞభావ మొసఁగియుꣳ.

చ. చనిన యనంతరంబునను చయ్యన ప్రౌఢసఖీజనంబులుꣳ
మనసిజుకేళి కింపయిన మందిరమందున జాళువాపతం
బనువుపడంగ గట్టి యతిహర్షత సంపెగతైలదీపముల్
యునిచిరి కొంద రంగనలు నుల్లమునందుల సంతసింపుచుꣳ.

చ. నిగనిగకాంతులుꣳ దనరు నిద్దపు టద్దపు మంటపంబునꣳ
పగడపు దారుతర్వడిని బట్టి యమర్చిన కోళ్ళయందులꣳ
జిగి దళుకొత్తు కుందనము జెక్కిన పట్టెలమర్చినట్టి యా
సొగసగు జాళవారుచుల శోభిలుపట్టున యల్లినట్టియుꣳ.

ఉ మంజులమైన దోమతెర మంచముమీదట హంసతూలికా
పుంజము చక్కఁగా చదరి పొల్పుగగూర్చిన పట్టుపర్పుపై
రంజితమైన సుప్రసవ రాజమునꣳ పొలుపొందు శయ్యనుꣳ
కంజదళాక్షి యుండుటకు కాంతులు మున్నె రచించిరంతటꣳ.

క. శ్రీమహిళ ధాత్రినీళలు
చామరగ్రాహిణియునాది సఖురాంద్రెల్లꣳ
ప్రేమమున పెండ్లికూతును
తామందరుఁ డాయవచ్చి తాత్పర్యముగꣳ.

చ. అరసియు నవ్వుమోములతొ హస్తయుగంబుల మేనునిమ్రుచుꣳ
సరసముగాగ నిట్లనిరి సాధ్విరో! నీమది నేరికోరి మꣳ

వరునిగ నోచినట్టి వ్రతవాంఛితయర్థము నేడు చేకురె
న్నరమర యేల నింక యనుమానము యేటికి లెమ్ము రమ్మికన్.

క. అనియిటు వారనుమాటలు
వినియును విననట్లుఁగాను వివశత నొందన్
మనమున వ్రీడ బెనంగొన
తనువున పులకలును నొదవ తనుమధ్యయటున్.

చ. అరసియు విష్ణుచిత్తసుత యానన మించుక వంచి సిగ్గునన్
మరుఁగుచు వారితో బదులుమాటలు నేమనఁజాల నేరకన్
తెరలుచునుండు నత్తెరఁగు దెల్సియు వారలు పేర్మిసంధిలన్
తరుణిని కౌఁగిటన్బొదివి తామటు దోడ్కొనివచ్చి రప్పుడున్.

క. సుందరు లందరు కేళీ
మందిర మటుఁ జేరవచ్చి మానిని నపుడున్
పొందుగ విరిశయ్యనుఁగల
మందరధరు సన్నిధానమందున నిలుపన్.

క. పతిమేన సతియుచేతన్
సతిమేనన్ పతియుచేత స్రక్చందనముల్
చతురత నతివ లలంకృతి
హితమతిఁ గావించి రపుడునింపుదలిర్పన్.

క. అలరుచు తమలములట్లుగ
పొలుపొందుగ నొసఁగజేసి పూబోణులటున్
మెలుకవగను కరసంజ్ఞల
తలుపుల నిటుమూసి వేగ తామటుఁదొలఁగన్.

చ. పనిగల దిప్పుడే మగుడి పొల్పడివేగమె వత్తు నే నని౯
చనెనొక ప్రౌఢకామినియు చయ్యన దానిని బిల్చి వేగమే
జనుగకవత్తునంచుఁ జనె సుందరి యొక్కతె దానివెన్కనిఁ౯
చనిరటు నొక్కరొక్కరును సొంజ్ఞలుఁజేసుక మెల్లమెల్లగా౯.

క. ముదితలు నీక్రియ క్రీడా
సదనంబటు వెడలిచనిన శరజాక్షు డటు౯
సుదతిని కౌఁగిటఁ జేర్చఁగ
మది నమ్మక జున్గుచుండు మాడ్కియు దెలియ౯.

ఉ. అంతకుమున్న తా కలలొయందును గన్పడి కొంతు క్రీడల౯
స్వాంతమురంజిల౯ గలసి చౌర్యతగా నటుదొల్గిపోవుట౯
యింతియు నమ్మకున్నదని నిచ్చను నావిధమెల్ల దెల్పి యా
కొంత ముదంబునొందగను కంజదళాక్షుఁడు ప్రేమసంధిల౯.

క. లీలామానుషయాకృతి
వాలాయముగాగ దాల్చి వరవర్ణిని తా
చాలావేడుక లలరఁగ
లాలించెను సౌఖ్యరతుల లాఘవముగను౯.

క. బాలా యీలా గేలా
చాలా నీమదిలొ నమ్మజాల వదేలా
డోలాయమానమౌ టిది
మేలా నామాట నీవు మెచ్చ వదేలా?

క. తరలాక్షి నీయడ౯ మది
నరమరసేయకను నేను ననురాగమునన్

శిరి, భువి, నీళలతోడను
సరిసముముగ నేలుకొందు సంశయమేలా ?

చ. అని తన పాణిపల్లవము నంబుజనేత్రి శిరంబుమీదటన్
కరమనురక్తితో నిడియు కౌఁగిటఁజేర్చుక నమ్మఁబల్కినన్
మురియుచు మోమునెత్తి మురమోహనుఁ గాంచి స్మితాస్యయౌచు దా
నరమరలేక నిట్లనియె హర్షము నెమ్మది నివ్వటిల్లగాన్.

చ. కరుణవిధేయ మీకృపను గంహ్వారి నేనుదయించుటాదియున్
మరువ కహర్నిశం బెపుడు మానసమందుల మీపదాబ్జమున్
నిరతము నేస్మరింపుచును నీక్రియ నుండుట దెల్సిదెల్యని
కన్నరణిని యిన్నినాళ్ళు కడగంటను గన్గొనవైతి వేమనన్.

చ. అని మృదునిష్ఠురోక్తు లిటు లాడిన లేమనుఁ గాంచి శ్రీధరుం
డనియె ప్రియంబుసంధిలఁగ నబ్జదళేక్షణ నీవు బాల్యమున్
జనక తలిదండ్రులాజ్ఞలలో చక్కగనుండుట యిన్నినాళ్ళటున్
చనుటయు తప్పుగాగొనక స్వాంతమునందుల మర్వకెన్నడున్.

కం. నామది భ్రాంతియు నీయెడ
నేమియు లేదంటి పకట యటుగాకున్నన్
చామరగ్రాహిణి వీయదఁ
కేమనిపంపుటయు నీకు నెరుకనులేదా.

క. అని తన యంతర్యార్థము
వనితయు వినఁగాను నిట్లు పలుకుచునుండన్
విని మగువ తనదు మదిని
న్ననుమానముఁదీరి చాల హర్షమునొందెన్

మ. అనురాగంబున భర్తృవాక్యములకుఁ హర్షంబు సంధిల్లఁగా
వనితారత్నము తత్పదాబ్జములపై వ్రాలంగని న్నావుడుఁ
తన పాణిద్వయి నెత్తి కౌగిట యటుఁ దాక్షిణ్యముఁ జేర్చుకఁ
మనసుఁ రంజిల నూరుపైనునుచుకఁ మైకేలను న్నిమ్రుచుఁ.

ప. అలరులశయ్యఁజేర్చి ముదమంద నవోఢను ప్రౌఢయౌనటుఁ
జలజదళాక్షి దంత రతిశాస్త్రనిరూఢత బద్ధనైపుణ
స్నలవడగాగనుం గలసి యైక్యమునై మది సంతసింపుచుఁ
సొలపునసొక్కి యిర్వురును సుప్తతనొందిరి పేర్మితోడుతఁ.

వ. అంత నాదివసావసానఅవశిష్టకాలంబున,

ఉ. అత్తరి తెల్లవారె హరిణాంకుని సత్కళజారె ధ్వాంతపున్
మొత్తము దూలె తారకల మర్వునుదీరె రథాంగకోటికిన్
హత్తిన వంతదీరె మకరాంకుని దుందును జారె జారవు
స్మత్తతతారె చాతకపు మండలి కూరుకుఁజేరె నయ్యెడఁ.

చ. కలువల నిద్రబుచ్చి ఘనగాఢతమంబునుపుచ్చి తమ్ములఁ
మెలఁగిన కీడుఁద్రోచి మరుమేపరిరాయనినెత్తి పువ్వునుఁ
వెలవెలఁబారఁజేసి విరివిల్తుని బింకమడంచి వెన్నునిఁ
వలపలికంటిబిడ్డడును వారకఁ దోచెను తొల్దిశాద్రినిఁ.

చ. వలపులరేనిజోదు తెరవాటున దుందువిటావిటావలీ
కలతలరద్దు నింకకొరగావని చాటెడుమాడ్కిగాగనుఁ
కలకలమంచు నన్నగరకానలకేకిశుకీపికావళుల్
పలుకఁగజొచ్చె నల్దిశల భానుఁడు ప్రాగ్దిశదోచునత్తరిఁ.

ఉ. చక్కెరవింటివాని పగసాగదుగావున మీర లింకనుఁ
మక్కువ గుట్టుజేసుకొని మౌనత కేళిగృహాంగణంబులఁ

చక్కఁగ వెల్వడంచు నని చాటెడు కైవడి మాటిమాటికిన్
కుక్కుటజాలమెల్ల తమ గూళ్ళను వెల్వడి యార్పుటించగాన్.

గీ. విష్ణుచిత్తతనయ విశ్వంభరుండును
సౌఖ్యరతుల తనను సరకుఁగొనక
కలసియునికి యరసి కాయజునెమ్మోము
వెల్లఁబోవుమాడ్కి తెల్లవారె.

వ. ఆసమయంబున.

క. బారులుగట్టియు సింహ
ద్వారంబుననున్ తదీయ దాస్యచయంబుల్
వారకనిల్చియు తమతమ
నేరుపు సంస్తుతులుఁజేయ నిదురలు దెలియన్.

చ. కలువలుగేరు కన్గవలు కాంతుని తండ్రియు విచ్చి నద్దెసల్
అలరుచుగాంచి కౌగిటను హత్తుకయుండెడి పల్లవాధరిన్
మెలకువసేయఁగా దలఁచి మెల్లన ముంగురులెల్ల కేలనుం
బొలుపుగఁ జక్కఁజేసి యటు పువ్వులసెజ్జయు డిగ్గి నయ్యెడన్.

క. తురంగంబు పాడితొలుదవును
కరిముకురము వేశ్యకన్య కలశార్తి వెసన్
శిరివరుడు తొలుతగాంచియు
సరగున గృహసీమ వెడలు సమయమునందున్.

ఉ. అందముగాగ యన్నగరి హర్మ్యములందలి ద్వారసీమలన్
దుందుభిశంఖకాహళులు తూర్యరవంబులు దివ్యగానముల్
క్రందుగ మ్రోయఁగా వినుచు కేళిగృహంబును లేమతోడుత
న్నిందిరవల్లభుం డపుడు వింపుగ వెల్వడివచ్చు నత్తరిన్.

క. ఫాలాక్ష పద్మభవులును
నాలించి ముదంబునొంది యనురాగమునన్
వాలాయంబుగ సభమున
పాలుబడిన్ వచ్చి నిలిచి భావుకమతితోన్.

గీ. రంగధామమహిమ రమ్యంబుగావిని
యుల్లమందు చాల నుత్సహించి
కరములొగ్గి నుతులు గావించి మ్రొక్కుచు
విబుధులలర కుసుమవృష్టి నపుడు.

వ. ఆ సమయంబున.

క. కావేరి చంద్రపుష్కరి
పావనమౌ నదులజలము పాల్పడివేగన్
కోవిదముఖ్యులు దెచ్చియు
శ్రీవరు కర్పింపఁ గొనియు చిత్తంబలరన్.

క. ప్రత్యూషఃకాలవిధులు
నత్యాసక్తతనుఁదీర్చి యనురాగమునన్
భృత్యామాత్యులుఁ గొల్వఁగ
ప్రత్యాసక్తతను శౌరి భాసిల్లె కడున్.

చ. కరకరు దంత పూర్వనగగంహరి వెల్వడివచ్చు నత్తరిన్
శిరివరు దంత యంతిపురి శీఘ్రత వెల్వడి కొల్వునింటికిన్
కరమనురక్తితో నరిగి కాంచనసన్మణిపీఠమ్మందునన్
శిరిభువినీళగోదలతొ శేముషిరంజిల నుండునయ్యడన్.

మ. పరివారంబుతొ పాండ్యచోళనృపతుల్ పద్మాక్షపాదాబ్జముల్
కరయుగ్మంబులబట్టి మానసములో కాంక్షల్ మదిన్ దీరఁగా

వరదుండై యభయంబొసంగి సగుచుఁ వాంఛార్థముల్ నిచ్చెదా
పరమార్తిఁ కృపఁజేసి యాజ్ఞనొసఁగఁ భావంబు రంజిల్లగాఁ.

చ. అమితప్రమోదతఁ నృపులు యాత్మనివేశముకేగ నిందిరా
రమణుని యాజ్ఞఁగాంచి యనురాగముతోడుత నప్పురీజనుల్
తమతమ మందిరంబులకు దారసుతాదిసుహృజ్జనాళితో
క్రమమున నేగియుండి రటు కంజదళాక్షుని లీలలెన్నుచుఁ.

ఉ. అంతట విష్ణుచిత్తు డతియార్తతతో వరపుత్రికామణిఁ
స్వాంతముఁ రంజిల నన్నరసి చాలప్రియంబుగ గారవించి స
భ్రాంతిగనుంగొన న్ననియె పట్టిరొ నీమది చింతసేయకఁ
సంతసమంది మాకిపుడు చక్కఁగ యాజ్ఞనొసంగు మింటికిఁ.

ఉ. అమ్మరొ నీవు బాల్యమున యందుననుండియు యమ్మహామహుఁ
నెమ్మది గోరుచుండుటచె నీరజగర్భుడు నట్ల తామదిఁ
మిమ్ములగూర్చె నీమదిన మెచ్చుము యింక విచారమేటికిఁ
సమ్మదమందుచుఁ కలసి సౌఖ్యసుఖంబుల నొందియుండుడీ.

చ. అని యిటు నవ్వధూవరుల కార్తితొ శ్రీహరిచిత్తమౌనియుఁ
వినయనయానురాగమున వేడ్కఁదలిర్పఁగ వారితోడనుఁ
మనములరంగ జెప్పుచును మక్కువ పుత్రినిగాంచి యమ్మ నీ
మనమున యాదియుంచు మొకమాటయు దెల్పెదనంచు నిట్లనెఁ.

చ. పతి హితుడయ్యె మాకెవరి బాధ్యతయేమ సహాంకరించకఁ
మతి సతికాంతదాతతను మానక శ్రీభువినీళలందునఁ
సతతము నైక్యముఁ మెలఁగి సౌఖ్యమువారలనాజ్ఞమీరక
న్నతులితభక్తియుక్తులను నందనుబాయక నుండగావలెఁ.

చ. సుదతులకెల్ల భూషణము జొచ్చినయింటికి పుట్టినింటికిన్
త్రిదశులుమెచ్చ కీర్తియును దెచ్చుటయే పరమార్థమంచు నీ
మది నిది దప్పకెప్పుడును మక్కువతోడ సుహృజ్జ నాదులున్
విదితముగాగ మెచ్చుకొన వేడ్కతొ నీవు మెలంగఁగాదగున్.

చ. అని యిటు విష్ణుచిత్తు డతి హర్షముఁ బట్టికి సత్యధర్మము
ల్లనుపడగంగదెల్పి యటు నాయమచేత యనుజ్ఞగైకొనిన్
చని శిరి ధాత్రి నీళలను చక్కగగాంచి మనస్సురంజిలన్
వినయమెలర్ప నిట్లనియె వెన్నుడు గన్గొనుచుండ నావుడున్,

ఉ. కన్నియ యుద్దరా లబల గానియు ప్రాజ్ఞతనే మెరుంగదున్
మన్నన మీసహోదరిగ మక్కువగల్గియు నేర్పునేరముల్
తిన్నగదెల్పి బుద్ధియును దెల్పెడుదాకను దిద్దుకోదగు
స్నన్నిట మీదె భారమును నౌననవల్సినదేమి యింకనున్.

చ. అని కడుదైన్యమున్కనుల నశ్రుకణంబులు జార పట్టిని
న్నొనరగ వారిమువ్వురియు నుల్లమురంజిల నప్పగింపఁగన్
ఘనతరపేర్మి వారటను గ్రక్కున కౌఁగిటఁజేర్చి యాఘనుం
గనుఁగొని నీకొమార్తెయెడగా నిటు నీమది చింతయేటికిన్.

చ. అమితమునైన భ్రాంతితొను మానిని మీరలు నెత్తిపెంచినన్
మమతచె నింతగా సనుటమాత్రమె మీమదిగల్గు భ్రామికన్
కమలదళాక్షి నచ్చరణకంజములానయె మీమనంబునీ
రమణియు యందులన్ మిగుల రంజిలగూర్చె విధాత మున్నిటున్.

చ. అనిశము మీసహోదరిగ నాత్మలొ భ్రామికయించుడంచు మీ
రనుటకుమున్నె మీమదిలొ యట్లుగయున్నదిగాన మీమదిన్

అనుకువనొందకుడు దని హర్షత వారభయం బొసంగ
యనఘుడు సంతసింపుచును హర్షత శ్రీహరిగాంచి యిట్లనెన్.

క. అఖిలాంతరాత్మయౌటను
యఖిలము నీవెరుగ నిదియు యవనింగలయే
సఖి నీప్రియురాలయ్యెను
యిక నేననవలసియున్న దెద్దియు చెపుమా.

చ. అని యిటు విష్ణుచిత్తు డతియార్తతతో వినుపింప నావుడున్
కనికరమొప్ప శ్రీహరియు గౌరతగా నిటు చేరబిల్చుకన్
మనమున చింతమాను మిక మానిని శ్రీ భువి నీళ లట్ల నా
మనసున వేరులేక కడు మక్కువతో సుఖసౌఖ్యలీలలన్
దనరుచునుండుగావున ముదంబుననుండుమటంచు బల్కుటున్.

చ. అనియభయప్రదానముగ నమ్మునిపుంగవు హస్తమందునన్
తన కరపల్లవం బిడియు తద్దయు పెద్దయు గారవింపఁగన్
మనమున చింతఁదేరి సుమమార్గణుతండ్రి పదారవిందముల్
తన నుదురంట మ్రొక్కుసను తామరసాక్షుఁడు కేలనెత్తిటున్.

క. దివ్యమణిభూషణంబులు
నవ్యదుకూలాంబరములు నమ్రతగాగన్
భావ్యుఁడయి పెండ్లివారికి
నవ్యాహతిఁగాగ నొసఁగె నళినాక్ష డటున్.

క. వటపత్రశాయి కింపగు
కటకాంగదరత్నమకుట గ్రైవేయాదుల్
పటుతరములైన తొడవులు
నిటలాక్షసఖుండు బనిచె నెయ్యమెలర్పన్.

సీ. జలజదళాక్షి సత్కృపకు సర్వసుహృజ్జను లెంతసంతసం
బలరుచునుండు నత్తరిని యంబుజనేత్రియు గోద యిట్లనెన్
తలఁపున మమ్ము యేమరియు ధన్విపురంబున నట్టె యుండకన్
నలరులమాలికల్ గొనియు నార్తితొ నిత్యము వేగరావలెన్.

చ. వలపులరేనికై చిలుక వైఖరి ముద్దులుగుల్క బల్కుచున్
పలుమరు తంత్రితో నిటుల భావమునంగల కోర్కెఁదెల్పఁగన్
న్నలరుచు నమ్మహామహుడు నాత్మజ కౌగిట గారవించి నీ
తలపునఁ గోరినట్లుగనె తల్లిరొ నీయెడఁబాయకుం డెదన్.

చ. అని యిటు భట్టనాథుడును నాత్మజ నెమ్మది యూరడిల్లగన్
వినయనయానురాగమున వేడ్కొదవంగను నమ్మఁబల్కియుం
జనియె సుహృజ్జనావళితొ చక్కగనాత్మజ యాజ్ఞగై కొనిన్
ఘనతరశంఖకాహళులు కైగనుముందర తూగిమ్రోగగన్.

వ. ఇట్లతిత్వరితయానంబున ధన్వినామపుటభేదనంబు చేరంజనునెడ సకలసుహృజ్జనంబు లెదుర్కొన వటపత్రశాయిసన్నిధానంబున కరిగి యమ్మహామహుడు సేవించి తనచేబంపిన సకలాంబరాభరణంబులు సమర్పించి శ్రీరంగధాము క్షేమంబు సక్రమంబుగా విన్నవించి తత్సన్నిధిన్ తీర్థప్రసాదోపజీవనంబుఁగావించి తదనుమతంబుగా దారాసహితుండై నిజనికేతనంబునకుం జని సుఖస్థితిగా విలసిల్లు చుండె నంత నిక్కడ.

క. శిరిఘువినీళలతోడను
హరిచిత్తుని కూర్మిపట్టి యనురాగమునన్
నిరతమునుకూడి యాడుచు
స్థిరముగ వసియించియుండె శ్రీరంగమునన్.

క. శృంగారకరంబగు యీ
రంగవిలాసంబు నెవరు రమ్యముగాగన్
పొంగుచు చదివిన విన్నను
మంగళకరమైన యశము మహినొందుదురున్.

క. అని యిటు యతిరాజేంద్రుడు
మనమలరఁగ నఖిలయార్యమండలికెల్లన్
వినుపింప వారలు న్విని
ఘనతరసంతోషభక్తి కలితాత్ములనై.

చ. అలరుచునుండి రంచు నిటు నార్యులు నెల్లను నానతిప్పఁగ
న్నిలపయి నీప్రబంధమును నింపుగ భాను శశాంక తారకల్
వెలయుచునుండునందనుక వేదకృదలిప్పుచు సుస్థిరంబుగన్
పొలుపుగనుండుఁగావుతను భోగిసగాఢ్యుని సత్కటాక్షమున్.

ఉ. పత్రితురంగ పాండుసుతపౌత్రభయంకరబాణభంజనా
క్షత్రియవైరిగర్వహర సారససంభవభాండగర్భితా
యత్రిజమౌళిచిత్తచలనాకృత చారుశరీర సుందరా
పోత్రి మృగాంగరూపవహ పూర్వసురేంద్ర కుమారరక్షణా.

క. శక్రాయుధ హరవాహా!
శక్రాహ్వయ రాజశయన శతధృతిజనకా!
శుక్రాక్షి దళిత కరనఖ!
శుక్రశిఖానికరపానకుంభద్విభవా!

విమతజనవిదారా! వేదవైద్యప్రచారా!
సమరవిజయధీరా! సాధుహృత్సంవిహారా!

అమరసుజనరక్షా ! అబ్ధిరాట్పుత్రీవక్షా !
శమితసకలపాపా ! శాశ్వతానందరూపా !

గ. ఇతి శ్రీమద్వేంకటలక్ష్మీనృశింహ వరప్రసాద లబ్ధ గీర్వాణాంధ్రోభయభాషాకవితావిచిత్ర విదేహరాజకన్యకాభ్యుదయాది షోడశమహాగ్రంథబంధురాలంకారనిర్మాణపారీణ ఘనయశోబంధుర మౌద్గల్య మహాఋషిగోత్రపవిత్ర వేంకటదేశికపౌత్ర కుమార వేంకటాచార్య పుత్ర మరింగంటి వేంకటనృశింహాచార్య విరచితంబైన గోదావధూటీ పరిణయంబను శృంగారప్రబంధంబునందు తృతీయాశ్వాసము భాశిల్లును.

సంపూర్ణము

స్వోచ్ఛిష్ట మాలికాబంధ గంధబంధురసింధవే
విష్ణుచిత్తతనూజాయై గోదాయై నిత్యమంగళం

శ్రీ నీలగిరి రాజధానిగా విలసిల్లు
రామగిరిక్షేత్ర ధామముగను
మంటపప్రాకారమాన్యత వెదజల్లు
గిరిరాజ మిచె రత్నగిరియుగాగ
రిపుల శిక్షించి ప్రేమపు భక్తరక్షకై
శ్రీరాముపై కృపఁజూపినావు
రామతారకమంత్ర రాజశక్తిని జూపి
మద మత్సరంబుల మాన్పినావు
చంచలచిత్తులఁ జైతన్యులఁ జేయ
ద్రవపదార్థము భక్తిఁ ద్రాపినావు
స్వార్థపరులకు పారమార్థ చింతనలిచ్చి
మిత్రభావము, సత్యసూత్రమిదితి
భయ, భక్తియుత నీతి నియమబద్ధుల ప్రియో
క్తుల నేర్పి ఫలమిడ గలిగినావు
లక్ష్మమతల్లి మా పక్షముండుటచేత
పాలించితివి రఘుపతి ! నరేంద్ర
లింగభేదములేని యనంగజనక
మలకనగ నీదు చల్లని చూపుజూఁచి
గా ! తరించితి మిక లేదుగా ! భయంబు
తపము ఫలియించె సీతాపతే ! రమేశ ! !

రామగిరిక్షేత్రము
నల్లగొండ
2-5-1956

ఇట్లు
భగవద్దాసుడు
ఆ. మ. శ్రీరంగాచార్యు
కనగల్లు